# దేశాభివృద్ధికి మొదలెక్కడ ?

**మ**నము 'దేశాభివృద్ధి' 'సర్వజనాభివృద్ధి' గురించి నిత్యసంభాషణ చేయుదుము. కాని యీ మాటల నర్థము చేసుకొ**గలిగే** **వా**రెందరు ? ప్రతి ఐదుగురిలో సలుగురు నిరక్షరులు. మనదేశ మెదుర్కొనుచున్న సమస్యలను **అర్థం**చేసుకొని, **వాటి** పరిష్కార సామర్థ్యతను **చేకూర్చే విద్యను ప్రజలకు లభింపచేయవలెను.**

ఇన్నికోట్లమంది భారతీయులను విద్యావంతులుగా చేయుటకు కాగితము **అత్యా**వశ్యకము. ఈ అవశ్యకతను పరిపూర్తిచేయుటకు భారతీయ కాగితపు పరిశ్రమ సంసిద్ధముగానే యున్నది.

మన దేశములోనున్న మొత్తము **32** కాగితము తయారుచేసే మిల్లులు సాలీనా **1,58,000** టన్నుల కాగితమును ఉత్పత్తి చేయుచున్నవి. **1956** సం॥ నాటికి 5 కోట్ల రూపాయలను వ్యయపరచి ఉత్పత్తిని **2,87,000** టన్నులవరకు హెచ్చించుటకు ప్రయత్నములు జరుగుచున్నవి.

ఆర్థికాభివృద్ధికి ఉక్కు ఎంతైనా అవసరము. అందుచేతనే టాటా కంపెనీవారు ఉక్కు వుత్పత్తిని రెట్టించుటకు విస్తరణ కార్యక్రమము నమలు పరచు చున్నారు.



| టాటా కంపెనీవారి ఉక్కు వుత్పత్తి | |
|---|---|
| 1955 | 10,50,000 టన్నులు |
| 1959 | 20,00,000 టన్నులు |

దేశాభివృద్ధికి ప్రయివేటు
పరిశ్రమ తోడ్పడుచున్నది

**ది టాటా ఐరన్ అండ్**
**స్టీల్ కంపెనీ లిమిటెడ్**

# ఆంధ్రపత్రిక

## సచిత్ర వారపత్రిక

## సమస్తాంధ్ర మహాజనులకు సంక్రాంతి కానుక

**18-1-56** తేదీ సంచిక సంక్రాంతి సంచికగా వెలువడుతోంది.

### ఎక్కువ పేజీలతో - కొత్త అందాలతో - కొత్త ఆకర్షణలతో

* తెలుగుసీమలో సంక్రాంతికి ప్రత్యేక విశిష్టత ఉన్నది. ఊరూరా, ఇంటింటా భోగిమంటలు, బొమ్మలకొలువులు, రంగవల్లులు కలకలలాడుతూ శోభిస్తాయి. తెలుగువారికి ప్రీతి పాత్రమైనది సంక్రాంతి పర్వం.

* ఏటేటా పండుగలాగా వచ్చే ఆంధ్రవారపత్రిక సంక్రాంతి సంచికకు కూడా ఇటు వంటి ప్రత్యేకతే ఉన్నది.

* కొత్త అందాలతో ఆంధ్రమహాజనుల హృదయాలలో ఉత్సాహాన్ని, ఉల్లాసాన్ని నింపడానికి మా సంక్రాంతిసంచిక ఆయత్త మవుతున్నది.

* మేము నడిపిన కథానికల పోటీకి అసంఖ్యాకంగా రచనలు వచ్చాయి. వచ్చిన వాటిలో ప్రథమ, ద్వితీయ బహుమతులకు తగినవని నిర్ణయింపబడిన రెండుకథలనూ సంచికలో ప్రచురించుతున్నాము.

* ఇవిగాక చక్కనికథలు, వ్యాసాలు, తదితరరచనలు సంచికలో ఉంటాయి.

* సంక్రాంతికి సంబంధించిన త్రివర్ణచిత్రాలు, రేఖాచిత్రాలు, తదితర చిత్రాలుకూడా ప్రచురిస్తున్నాము.

* ఇంటింటా, ప్రతివారిచేతిలో ఉండవలసిన మా సంక్రాంతి సంచిక పాఠకులకు ఆనందం కలిగించగలదని మా నమ్మిక.

**పండుగనాటికే సంచిక మీకు అందుతుంది**

**వెల పావలా మాత్రమే. మీ ప్రతి నేడే రిజర్వు చేసుకోండి**

| సంవత్సర చందా రు. 12-0-0 విడిప్రతి 4 అ. |  | సంపుటము 49 సంచిక 17 28-12-55 |
|---|---|---|

సచిత్ర వారపత్రిక

**Founder : K. NAGESWARA RAO**

మన్మథ మార్గశిర శుద్ధ చతుర్దశి బుధవారం


## విషయానుక్రమణిక



# న్యూఢిల్లీ లేఖ

**గోవాపట్ల డల్లెస్ వైఖరి; పార్లమెంటులో 'కోరమ్' కొరత; 'డాన్' పత్రిక దుష్ప్రచారం; అట్లీ పదవీ విరమణ.**

భారతదేశం కమ్యూనిస్టు దేశాలతో కలిసి భాయీ భాయీ అనే అంతవరకు జాన్ ఫాస్టర్ డల్లెస్ చేయగలిగినదంతా చేశాడు. భారతదేశానికీ పాకిస్థాన్‌కీ మధ్య చాలా కాలం నించి కుల మత విషయాలలో బయలు దేరిన లావాదేవీలన్నీ మఱచిపోయి పాకిస్థాన్‌కు బాగా ఆయుధాలు సరఫరా చేయించాడు. దీనితో ఇండియాకు పాకిస్థాన్‌కి మధ్యన వ్యవహారాలు కొంచెం పాకంలో పడ్డాయి. గోవా వ్యవహారంతో ఇది బాగా ముదిరిపోయింది. పోర్చుగల్‌ను వెనక వేసుకు రావడంలో డల్లెస్ అమాంతంగా ఒక బ్రహ్మాండమైన సమస్య ఒకటి తెచ్చి పెట్టాడు. ఈ విధంగా నెహ్రూకొక గుణపాఠం నేర్పినట్టవుతుందని ఈయన అనుకొన్నాడు. కాని దీనితో ఆసియా వ్యవహారాలన్నీ అస్తవ్యస్తమయినాయి. జాన్ ఫాస్టర్ డల్లెస్ అమెరికా విదేశాంగ మంత్రిగా ఉన్నంతవరకు, అమెరికా భారత దేశాల మధ్య సౌమనస్యం ఏర్పడడం కల్ల.

అమెరికా వారిపాటికైనా డల్లెస్ చేసిన ప్రకటన ఫలితాలవగాహన చేసుకోవడం మంచిది. భారతదేశంలో అమెరికా అంటే ఎంతైనా సద్భావం ఉన్నది. సహజంగా భారతీయులు కృతజ్ఞతాభావపూరితులు. విల్సన్ మొదలుకొని రూజ్వెల్టుదాకా అమెరికా అధ్యక్షులందరు, ఇండియా స్వాతంత్ర్యానికి చేయూత ఇచ్చిన విషయం భారతీయులు విస్మరించలేదు. భారతీయులకు అమెరికా యెడల పెంపొందిన సుహృద్భావం అంతా జాన్ ఫాస్టర్ డల్లెస్ ఒక్కసారిగా మంటగలిపివేశాడు.

*  *  *  *

మన పార్లమెంటు శీతాకాలం సమావేశం చాలవరకు ముగిసిపోయినట్టే. అయితే ఇటీవల దీనికి 'కోరమ్' లేక పోవడమనే దీర్ఘ వ్యాధిపట్టుకుని బాధిస్తున్నది. పార్లమెంటుకు దగ్గరగా సభ్యులంతా బాతాఖానీకొట్టడానికి ఇంకో హాలుంది. ఇది మూసివేస్తే ఈ దీర్ఘవ్యాధి నయమయి పోతుందని వైద్యశిఖామణులు కొందరు సలహా యిస్తున్నారు.

**శ్రీ కృష్ణ**
(ఆంధ్రపత్రిక న్యూఢిల్లీ ప్రతినిధి)

ఇంతేకాక ఈ పార్లమెంటు సభ్యులందరికీ ఫస్టుక్లాస్, సెకండ్ క్లాస్ ప్యాసులు, నెల నెలకీ భత్యాలు ముట్టజెప్పడంవల్ల వీరికి పని అంటే వల్లమాలిన బద్ధకం పట్టుకున్నదని కూడా ఒక పుకారు పుట్టింది. అంటే పార్లమెంటు సభ్యులకు చర్చలో పాల్గొనడానికింకా కొంత హుషారు సరఫరా చేయించాలన్నమాట! ఇదంతా నిజమైతే పార్లమెంటు సభ్యుల పరపతి ఏమీ బాగాలేదన్నమాటే!

ఇంతకీ పార్లమెంటులో 'సచేతక్'లంతా ఏంజేస్తున్నారని ఇంకొకవిమర్శ వచ్చింది. పార్లమెంటులో సభ్యులహాజరుపూచీ అంతా వహించాలిసినవారు విరేగదా మరి!

* * *

'డాన్' పత్రిక ద్వారా పాకీస్థాన్ ఇటీవల మళ్ళీ ఇండియా మీద కత్తి దూసింది! ఇటీవల సావుదీ అరేబియా రాజు భారతదేశానికివచ్చి, ఇక్కడ ముస్లిముల విషయంలో భారతదేశం ఎంతో శ్రద్ధవహిస్తున్నదని ప్రశంసించారు. జమైయత్ ఉల్ - ఉలేమా హింద్ పక్షం ఇక్కడ మహమ్మదీయులు ఎన్నో అగచాట్లనుభవిస్తున్నారని లేనిపోని అభాండాలు విసిరింది. దీనిమీద డాన్‌పత్రిక ఈవిధంగా సంపాదకీయం రాసింది:

"భారతదేశంలో ఉన్న మహమ్మదీయులు భారతీయులని, అందుచేత వారిని బలవంతంగా హిందూమతంలో కలిపివేసినా మాటాడ కూరుకోవాలనీ చెప్పేమాటలు పాకీస్థానీయులెన్నడూ సహించరు."

ఈపత్రిక ఇంతటితో ఊరుకోక పాకీస్థాన్ హిందూనాయకులు తాము నిజమైన పాకీస్థాన్‌పౌరులవునో కాదో నిక్కచ్చిగా తేల్చుకోవాలనికూడా హెచ్చరించింది.

తూర్పుపాకీస్థాన్‌నించి తండోపతండాలుగా హిందువులు కలకత్తాకు వచ్చిపడుతున్నారని భారత పునరావాస మంత్రి మెహర్‌చంద్ ఖన్నా ఇటీవలనే ప్రకటించారు.

పూర్వం నాజీలు జర్మను లెక్కడ ఉన్నా ఏదేశీయులైనా వారి పరిరక్షణ భారం అంతా తమదేనని ఒక విచిత్రమైన సిద్ధాంతం లేవదీశారు. ఇప్పుడు పాకీస్థాన్ కూడా ఇదేమార్గం అవలంబిస్తూంది. పూర్వం పాకీస్థాన్ ప్రజల్లో ఆర్థికంగా అశాంతి రేకత్తితే, ఆదేశంలో ప్రభుత్వం ప్రజల అశాంతిని క్రొత్త పుంతల్లో మళ్ళించడానికి మత కలహాలవైపు దృష్టి మళ్ళిస్తూండేది. ఆర్థిక సమస్యలు పరిష్కరించ లేకపోవడం వల్లనే ఈ పన్నాగాలవసరమయ్యేవి. ఐతే పాకిసాన్ ముసల్మానులకీ పన్నాగాలంటే అప్పుడే మొహం మొత్తిపోయింది. అమెరికా ఆర్థిక సహాయం అందినా అక్కడ ముస్లింల ఆర్థిక పరిస్థితి ఏమీ బాగుపడినట్లు కనబడదు. పాకిస్తాన్ మహమ్మదీయు లప్పుడప్పుడు భారతదేశానికి వచ్చి ఇక్కడ పరిస్థితులు బాగా ఆకళించుకొంటున్నారు. భారతదేశం ఆర్థికంగా ముందంజ వేస్తున్నదన్న వార్తవల్లకూడా వారి అసంతృప్తి మితిమీరుతున్నది. ఈ పరిస్థితిలో పాకిస్తాన్ పరిపాలకులు దేశంలో తమ అధికారం నిలబెట్టుకోడానికి ఆ దేశం ముస్లిములలో భారతదేశ ద్వేషము, పాకిస్తాన్‌లో ఉన్న హిందువులపై కత్తులు రెచ్చగొడుతున్నారు. ఈ అధికార రాజకీయాల దురహంకారంలో పాకిస్తాన్ హిందువులు, భారత మహమ్మ



మదాం సన్యత్ సేన్ ఈనెల 16 న ఢిల్లీవచ్చినప్పుడు ప్రధాని నెహ్రూ, రాజకుమారి అమృతకౌర్ ఆమెకు స్వాగతమిచ్చారు.



ఉజ్బెక్ సాంస్కృతిక ప్రతినిధుల వర్గంలోని నాట్యకత్తెలు: మిరాకారి మోహాకుందుజ్; యునుసోవా తమోరా; కైదానిఫ్లోరా.

దీయులు ఇరుకున పడిపోయారు. తూర్పు పాకిస్తాన్ హిందువు లప్పుడే ఇండియాకు ప్రయాణం అవుతున్నారు. అయితే భారత దేశంలో మహమ్మదీయు లెవరు ఇక్కడ నుంచి వెళ్ళడం లేదు. ఇది "డాన్" పత్రిక దుష్ప్రచారానికీ, ఆ పత్రిక మిత్రుల అబద్ధాలకు, ఒక చక్కని తార్కాణం. ఈ సమస్య ఇంకొక దృక్పథంతో పరిశీలించవచ్చును. పాకిస్తాన్ హిందువుల నిజాయితీని డాన్ పత్రిక శంకించింది. ఇలాగే భారత ప్రభుత్వంకూడా భారత మహమ్మదీయుల నిజాయితీనిగురించి విచారణ జరిపించ వచ్చునా? డాన్ పత్రిక, జమయత్—ఉల్. ఉలేమా పక్షము ఇండియా ముస్లిములను వారి మానాన వారిని విడిచిపెడితే రక్షించినంత పుణ్యం.

*　　*　　*　　*

ఇటీవల మరొక ప్రముఖ సంఘటన జరిగింది. అట్లీ బ్రిటిషు లేబర్ పార్టీ నాయకత్వం పదవినించి విరమించి విశ్రాంతి తీసుకున్నారు. సైమన్ కమిషన్ రోజులనాటి నించీ ఈయన కిండియాతో సన్నిహిత సంబంధం ఉన్నది. ఆ రోజులలో ఈయన స్పెషల్. రైలులోనించి దిగడమూ "గోబాక్ సైమన్" అని కేకలు వెయ్యడం కొందరికింకా బాగా జ్ఞాపకం ఉంది. అట్లీ ప్రభుత్వమే 1947 లో భారతదేశానికి స్వాతంత్ర్యం ప్రకటించింది. రెండేళ్ళకు పూర్వం ఈయన ఒకసారి భారతదేశం వచ్చారు.

అట్లీ పదవి విరమణతతంగం అంతా ఆంగ్లదేశం రాజకీయాల సంప్రదాయాలలోనే నడిచిపోయింది. బ్రిటిషు వారికి రాజకీయాల్లో పడి కొట్టుకోవడమూ, హాయిగా వాటిలోనించి విరమించడమూ వెన్నతో పెట్టిన విద్యలే! పదవీ విరమణ తరువాత బహుమర్యాదగా కాలక్షేపం చెయ్యడం వారికి తెలిసినట్లింకెవరికీ తెలియనే తెలియదు! 72 సంవత్సరాల యువకుడు రాజకీయాలు విడిచిపెట్టడం ఇక్కడ వారికి బాగా విడ్డూరంగా కనబడవచ్చును. భారత రాజకీయ వేత్తలలోగాని, అధమం మంత్రివర్గ సభ్యులలోగాని ఈపదవీ విరమణ నైపుణ్యం ఎంతవరకు అలవడింది? హాయిగా ఉద్యోగం గొడవలు చాలించుకొని ఇవతల పడడానికీ వీరికీ సగమెరుక! చాలామంది మేము విశ్రాంతి తీసుకుంటామంటారు గాని, వెంటనే పెరటిదారిని పదవీ వ్యామోహములో పడిపోతారు. ఇక మరి పదవీవిరమణ అంటే పరలోకానికి ప్రయాణం కట్టడం అన్నమాటే!

*　　*　　*　　*

ఈక్రింద ఇచ్చిన సంఖ్యలు ఉత్సాహకరంగా ఉన్నాయనడంలో సందేహం లేదు.

రైల్వేలు మినహా మిగతా కేంద్రప్రభుత్వ శాఖాకార్యాలయాల్లో ఉద్యోగుల సంఖ్య 1951 డిసెంబరులో 5,90,662 ఉండగా 1955 జూన్‌లో 7,10,523 ఉన్నది. ఈ క్రింది సంఖ్యలు పరిశీలిస్తే ఈ పెరుగుదల బాగా బోధపడుతుంది.

మొదటి పంచవర్షప్రణాళిక పూర్తి కావడానికి ఇంకా 9 నెలలు ఉన్నది. ఈ ప్రణాళిక క్రింద కేంద్రప్రభుత్వపు ఉద్యోగాభివృద్ధి ప్రయత్నాలు ఫలించాయనడానికి, ఒకలక్షా ఇరవై వేల ఉద్యోగాలు ఇప్పటివరకూ ఎక్కువ కావడమే నిదర్శనం.

| | 1951 డిశెంబర్ | 1955 జనవరి | 1955 జూన్ |
|---|---|---|---|
| పరిపాలన నిర్వహణోద్యోగులు— | 54,814 | 44,837 | 48,347 |
| గుమాస్తాలు— | 1,42,850 | 1,75,566 | 1,83,943 |
| పూర్తి నిపుణులు, కొంతవరకు నిపుణులు— | 1,45,304 | 1,58,697 | 1,56,497 |
| నిపుణులుకాని ఉద్యోగులు— | 2,47,694 | 2,54,062 | 2,49,938 |
| తాత్కాలికావసరాలకు నియమితులైనవారు— | — | 18,728 | 71,798 |
| మొత్తం | 5,90,662 | 6,51,890 | 7,10,523 |

# ఉద్యమనాయకుడు వినోబాభావే

విశాఖజిల్లాలోని ఒక గ్రామంలో ఒకాయన అర ఎకరం భూమికి దానపట్టా వ్రాసి ఆచార్య వినోబాభావే చేతికి అందిచ్చారు.

'మీకెంత భూమి ఉందండి?' అని భావే అడిగారు.

"వంద ఎకరాలండి."

"నేను మీ దానంపట్టను. అర యెకరం పుచ్చుకోవడం మీకే అవమానకరం" అంటూ భావే ఆదానం తిరస్కరించారు.

"ఇది భిక్షుకోద్యమం కాదు; నేను ముష్టికి రాలేదు. మీ విధి, మీతోటి వారి హక్కు తెలియ చెప్పడానికి వచ్చాను" అని ఆయన చెప్పారు.

ఆంధ్రదేశంలో పాదయాత్ర చేస్తున్న భావే అనేక సందర్భాలలో అనేక విధాలభూదానయజ్ఞ స్వరూప స్వభావాలను, ఉద్యమ పరమార్థాన్నీ తేట తెల్లంగా తెలియ చెప్పారు.

## దానం, న్యాసం

నీరు, గాలి వలెనే భూమి కూడా దైవదత్తం. ఒక వ్యక్తికీ, ఒక గ్రామానికీ, పట్టణానికీ, ఒక దేశానికీ చెందినది కాదు; నిఖిల ప్రపంచానిదీని. ఈదృక్పథం కావాలి.

ఉన్నదాంట్లో కొంత ఇస్తే అది దానం అవుతుంది. అలా కాకుండా, కొంతమాత్రం స్వంతానికుంచుకుని మిగతాదంతా యిచ్చివేస్తే అది సామాజిక ప్రక్రియ. అంతా సమాజానిదే అనియెంచి, యిచ్చివేస్తే న్యాసం. నా ఉద్యమానికి దానం మొదటి మెట్టు. న్యాసం పరమావధి.

## పెరిగేది, తరిగేది

ఈ ప్రకారం, లేనివారికి భూమి ఇవ్వడమే కాదు; ఉన్న భూమిని సమంగా పంచాలని నా సంకల్పం. లేనివారికి భూములిచ్చి వారి సోమరితనాన్ని పోగొట్టడం, దుర్గుణాలు నిర్మూలించి, సమాజంలో సమాన ప్రతిపత్తి గౌరవం లభ్యం చేయడం నా లక్ష్యం. భూదానం అంటే దరిద్రం పంచుకోవడమంటున్నారు కొందరు.

సర్వదా ఒకటి జ్ఞాపకం ఉంచుకోవాలి... తోటివారితో పంచుకోవడంవల్ల సౌఖ్యం సంపద పెరుగుతాయి; దుఃఖం, దరిద్రం తరుగుతాయి.



భూదానోద్యమ సారథి శ్రీ వినోబా.

## బెదరింపులు తగవు

ఆచార్యభావేకి సవ్యంగా భూదానం ఇవ్వకపోతే చట్టం ప్రవేశపెట్టి బలవంతాన తీసుకుంటామని కొందరు మంత్రులు బెదరిస్తున్నారు. అది తప్పు. ఆ బెదరింపులు చూచి, ఎవరూ దానం ఇవ్వనక్కరలేదు. మేము ప్రేమపూర్వకంగా అడుగుతున్నాము. మీరు ప్రేమతో ఇవ్వండి.

## నాయకులపై నమ్మకంలేదు

ప్రజానాయకులంతా ఈ భూదానోద్యమం పట్ల గురియుంచి, కృషిచేస్తే వారివల్ల ఈ మహత్కార్యం నెరవేరుతుంది కాని, నాయకుల మీద నమ్మకం లేకనే, నేను బయలుదేరాను...

ఒక రాజకీయనాయకుడు ఒకసారి భావేను కలుసుకొని, ప్రజాస్వామికం పటిష్ఠంగా సాగాలంటే ప్రతిపక్షం బలంగా ఉండాలన్నారు.

'ఈ ప్రతిపక్షాలవారు ఎంతసేపు రాజకీయ దృక్పథంతో, బలంగురించి ఆలోచిస్తారు. నిర్మాణ కార్యక్రమాలపై ఎక్కువ శ్రద్ధచూపితే దేశానికి నిజమైన బలం చేకూరుతుంది' అని భావే ప్రవచించారు.

## ఇద్దరు మూర్ఖులకథ

హరిజనోద్ధరణగురించి భావే ఒక కథ చెప్పారు.

ఒకచోట ఒక తాడు పడిఉంది. ఒకడు దాన్ని చూచి పామనుకొని బెదరి పారిపోయాడు. తరవాత ఇంకొకడు వచ్చి పామే అనుకొని, కర్రతో కొట్టాడు. నిజానికి ఇద్దరూ మూర్ఖులే.

హరిజనులను మీరు దూరంగా ఉంచనూ

(58-వ పేజీ చూడండి)

---

నా ఒక్కడికీ తిండి ఎలాగా అన్నది భౌతికసమస్య. నా సోదరమానవులకు తిండి ఎలాగా అన్నది ఆధ్యాత్మికసమస్య.

—నికొలాస్ బెర్డ్యాయెవ్.

---

# వ్యాసుని వ్రాయసకాడు

## ప్రాచీన గాథాలహరి

వ్యాస భట్టారకుడు ఆనందంతో ఒక్కసారిగా ఉబ్బి తబ్బిబ్బైపోయినాడు! 'ఈనాటికిగదా! నేను చేసిన మహాతపస్సంతా ఫలించింది!' అని లోలోపల ఎంతైనా మురిసిపోయాడు! మళ్ళీ తన కళ్ళ ఎదురుగా ప్రత్యక్షమైన బ్రహ్మదేవుని చూచి "నేను కలగంటున్నానా? మేలుకొన్నానా?" అని రెండు మూడు మారులు కన్నులు నులుముకొన్నాడు. తన ఎదురుగా ప్రత్యక్షమైనది సాక్షాత్తు ఆ చతుర్ముఖుడే! ఇంక సందేహ మేమీ లేదు!

వెంటనే ఆయనకు అర్ఘ్యపాద్యాదులతో షోడశోపచార పూజ చేసి భక్తికంగా సాష్టాంగ నమస్కారం చేశాడు,

కమలాసనుడు వ్యాసుని భుజాలపై మెల్లిగా తట్టి "లే నాయనా! నీ సత్సంకల్పం ఫలిస్తుందిలే!" అన్నాడు. వ్యాసుడు లేచి బ్రహ్మదేవుని పాదాలకు దగ్గరగా కూర్చున్నాడు.

అయినా, వ్యాసునికి సంతృప్తి కలగ లేదు. తన లోలోపలి మనోరథా లన్నీ బ్రహ్మదేవుని కిలా నివేదించుకొన్నాడు:

"చరాచర ప్రపంచాని కంతటికీ సృష్టికర్తలైన తమకు సకల ప్రాణి కోటిమనో భావాలున్ను కరతలామల కాలేగదా! అయినా అజ్ఞానచాపల్యం వల్ల, ఏదో విన్నవించుకొంటున్నాను. నా అపరాధం క్షమించాలి!......

నా వంశీయులైన భారతవీరుల మహత్తర గాథ స్మరించినపుడు, నాలో అపారమైన కరుణ, భరింపరాని వేదన, దృఢమైన ధర్మపరిరక్షణ శ్రద్ధ మొదలైన ఎన్నో భావాలుద్భవించి తలముసక లౌతూంటాయి! ధర్మ సంగ్రహార్థమై ఆ గాథ యావత్తు భారతేతిహాసంగా రచించవలె ననే సంకల్పం, కలిగి, అది నా తీవ్రతపశ్చర్య కనేక విధాలుగా అంతరాయం కలిగిస్తున్నది. ఈవిధమైనటువంటి అంతరాయం ఎన్నడున్ను నేను కన్నదీ గాదు విన్నదీకాదు! ఏమి చేయడానికిన్నీ పాలుపోదు! ఈ అంతరాయరహస్యం అవగాహన చేసుకుందామనే జిజ్ఞాసతో నే-"

దీనికి చతుర్ముఖుడొక్క చిరునవ్వునవ్వి:-

"నాయనా! ఈ నీ ఇతిహాసనిర్మాణం నీ తపశ్చర్య కెంతమాత్రము అంతరాయం కానేరదు!" అన్నాడు.

వ్యాసుడు ఆశ్చర్యం పట్టలేక ఆయనవైపు దేవిధంగా తిలకించాడు.

"మహర్షీ! ఈ ఇతిహాసరచన నీవు చేసే తపశ్చర్యకన్నా మహత్తరమైన తపశ్చర్య సుమా!" అన్నాడు సృష్టికర్త తిరిగీ ఇంకొక మారు!

సాత్యవతేయు డాయనమాటలకు కొంత కాలం నిశ్చేష్టుడైపోయాడు. వెంటనే వ్యాసుని పెదవులపై చిరునవ్వులు చిందులు దొక్కాయి.

"అవును! నా జ్ఞాననేత్రం వికసిస్తున్నది. నేను తెలియక ఏమేమో! ప్రలాపించాను. మన్నించవలసింది!" అన్నాడు.

పిమ్మట అతడు కన్ను రెప్ప వేయకుండా బ్రహ్మదేవుని ఫాలభాగంపై తీక్ష్ణదృష్టి నిలిపి తిరిగి ఇలాగ నివేదించాడు.

"ఈ మహాభారతగాథ చాలావరకు నా చర్మచక్షువులకు ప్రత్యక్షంగానే జరిగింది. అయితే అప్రత్యక్షంగా జరిగినటువంటి కొన్ని సంఘటనలు, అజ్ఞేయమైన ఆయా భారతవీరవరేణ్యుల మనోవృత్తులు - కొన్ని కొన్ని - నాకింకా దృశ్యాదృశ్యంగానే ఉండిపోతున్నాయి. అవి అవగాహనకానిదే నా ఇతిహాసనిర్మాణ సంకల్పం నెరవేరదు. స్వయంగా మానవుల మనోవృత్తు లుద్భవింపజేసి, జగద్రూపక సూత్రధారులైన మీ అపారకరుణాకటాక్షం కించిత్తు నామీద ప్రసరిస్తేతప్ప నా సంకల్ప సాకల్యంగా నెరవేరదేమో ననే పరిక్షయం నన్ను కేయివిధాల బాధిస్తున్నది - "అని మహర్షి ఇంకా ఏమేమో చెప్పబోయాడు.

కమలాసను డతనిమాటలకు అడ్డువచ్చి ఇలాగ ప్రత్యుత్తరం ఇచ్చాడు.

"సాత్యవతేయా! సంకీర్ణమైఉన్న చతుర్వేదాలున్ను స్వయంగా విభజించి, లోకానికి వేదజ్యోతి ప్రసాదించి, వేద వ్యాసుడనే ప్రతిష్ఠ పొందిన వాడవుగదా! ఎందుకయ్యా! నీ కింత వేలతనము! స్వయంగా నీవనేక విషయాలు తెలిసి ఉండిన్నీ, పెద్దల యెడల వినయము కనబరచవలెననే భావంతోనే ఈ విధంగా వేడుకొంటున్నావు! అయినా— భారత సంహిత కల్పనా సమయంలో నావు గూడా అజ్ఞేయంగా ఉండిపోయినటువంటి అనేకమైన జీవ రహస్యాలు నీకళ్ళ ఎదుటటే

~~~~....~~~~

పి. గణపతిశాస్త్రి
~~~~



వ్యాసుడు - వ్రాయసకాడు.

చిత్రకారుడు: [illegible]. ఎల్. [illegible]



# వ్యాసుని వ్రాయసకాడు



ప్రత్యక్షం కాగలవు! తిరిగి ఆ భారతగాథ యావత్తు నీ విజ్ఞాన నేత్రం ఎదట ఇంకొక సారి జరిగిపోతూన్నట్లుగా నే — వర్తమాన రూపంలో నే — అనుభూతం కాగలదు! లే! భారత సంహితా రచన కుపక్రమించు మహాకవీ!!"

ఉరుములురుమినట్లు వినబడిన సృష్టికర్త వాక్యాలకు వేదవ్యాసుడు విస్మితుడై అలాగే తదేక దృష్టితో ఆయనకేసి చూస్తూ ఉండిపోయాడు. సాత్యవతేయుని ముఖంలో సందేహచ్ఛాయ ఇంకా అలాగే చూచాయగా పొడగట్టింది.

చతుర్ముఖుడతనికేసి, "ఏమిటి నాయనా! ఇంకా నీ సందేహం!" అన్నట్టు చూశాడు. వేదవ్యాసుడు కొంచెం సందేహిస్తూ తన మనోభావం ఈ విధంగా తెలుపుదు చేసుకొన్నాడు.

"నేను ఏమని విన్నవించుకొన్నా ఏదో విధంగా తమయెడల అపచారం చేస్తున్నట్టే భాసిస్తున్నది. మరి తమకింక ఏమని విన్నపం చేయగలను?"

పద్మగర్భుడొక్కసారి పకాలున నవ్వి, ఎంతో ఆప్యాయంగా అతన్ని దగ్గరికి తీసుకొని "నీలో కజ్జత పరిశీలించినకొద్దీ నాకెంతో ముచ్చట కలుగుతున్నది ... ఈ ఉపచార వాక్యాల కేమిగాని సంగ్రహంగా నీ సందేహం తెలియజెయ్యవయ్యా!" అన్నాడు.

మహర్షి మళ్ళీ తన ఫాలంమీద రెండు చేతులు కమలముకుళంలా జోడించి, అంజలి ఘటించి మెల్లిగా ఇలాగ విన్నవించుకున్నాడు:

"భారత సంహితవిషయం స్మరించేసరికి హృదయం పొంగి పరవళ్ళు తొక్కుతున్నది. ఎన్నెన్ని చిత్రవిచిత్రఘట్టాలు! ఎన్నెన్ని రోమహర్షణ సంఘర్షణలు! అవన్నీ శ్లోకవాహినులై, వెల్లువలై నా హృదయంలో ప్రవహిస్తున్నవి. విద్యుద్వేగంతో నా భావనాలోకంలో ఆవిర్భవించే ఆ శ్లోకాలన్నీ తిరిగి ఇట్టే విస్మృతి కుహరంలోనికి వెళ్ళిపోతున్నవి! ఆశ్లోకాలన్నీ శీఘ్రంగాలిఖించే దివ్యలేఖకు లెవరైనాలభిస్తే బాగుండు నే అనుకుంటున్నాను. — పోనీ వైశంపాయనునికి గానీ, పైలునికిగానీ, మిగిలిన శిష్యులకు గానీ అవి చెబుదామా అంటే — వారింకా దర్భకర్రలుకూడా తిన్నగా తుంచలేని పసివాళ్ళే గదా! ఈ విధమైన డోలాందోళనతో నా మనస్సు బొత్తిగా వశంతప్పిపోతున్నది. — తత్రాపి జరాభారంకూడా కొంచెం మితిమీరుతున్నదన్న భయం వేధిస్తున్నది!"

"మహాగణాధిపతిని ధ్యానించుకో! ఆయన సర్వ విఘ్న నివారంత! సమస్త సందేహాలు, అంతరాయాలు ఆయన దర్శనమాత్రం చేతనే నివృత్తి అయిపోగలవు! నీ సత్సంకల్పం సాక్షాత్తు సరస్వతీ సంకల్పమే అన్న విషయం విస్మరించకు! నాయనా! నీవు కేవలం నిమిత్తమాత్రుడవే! సుమా!"

అని అభయం ఇస్తూనే కమలాసనుడక్కడనే అంతర్హితుడైనాడు!

మహర్షి మరునాడు ప్రాతఃకాలవేళ భాగీరథీతీరాన నిశ్చలంగా గణాధిపతిని ధ్యానిస్తూ ప్రశాంతభావం వహించాడు.

హిమవత్పర్వత సమీపంలో — ఆ మహర్షి ఆశ్రమంలో ఉన్న అంతేవాసులంతా ఆయన ధ్యాననిష్ఠచూసి విస్తుపోయి రెప్పపాటు లేకుండా నిలబడిపోయారు. శీతకాలం లేత లేత సూర్యకిరణాలకాంతిలో గంగానది ఇసుక తిన్నె అంతా ఒక బంగారుతిన్నెలా తళతళ మెరిసింది. పక్కనే నదిలో ప్రతిఫలిస్తున్న తెల్లని రెల్లుపువ్వులుకూడా ఆ ఎర్ర ఎర్రని వెలుగుల్లో ఆహితాగ్ని హోమజ్వాలల్లా వెలిగాయి. మహర్షి తలపై పెనవేసుకున్న జడలేవో ఆ అరుణకిరణాలేవో తిన్నగా తెలియడంలేదు! ఆయన ధరించిన కృష్ణమృగ చర్మంపై నల్లనల్లని చుక్కలు మాత్రమే ఆ పైడివెలుగుల్లో కొంచెం స్పష్టంగా కనిపిస్తున్నాయి. ఆ ప్రశాంత వేళలో పిల్లగాలులు కూడా అలిసి సొలిసిపోయిన తరంగాలమీద తలలు వాలుస్తున్నట్లుగా మందగించిపోయాయి. ఇంతవరకు నదీ తీరంలో కెరటాలలో ఉయ్యాల లూగుతున్న హంస మిథునాలు కూడా తమ రెక్కల్లో పండుపగడాలముక్కులు దాచుకొని, పరమ హంసల్లా ధ్యానముద్రలో మునిగిపోయాయి. అవి అన్నీ ఆమహర్షిఎదట వెయ్యిరేకుల తామర పువ్వుల్లా తేలాయి.

ఇంతలో వ్యాసమహర్షి శరీరం అంతా ఒక్కసారిగా గగుర్పొడిచింది! ఆనందబాష్పాలు రెండు కళ్ళల్లోను నిండిపోయి చెంపలమీద జలజలా రాలాయి! అతని కెదురుగా విఘ్నేశ్వరుడు పన్నెండేళ్ళ బాలకుమారుడులా ప్రత్యక్షమైనాడు!

పార్వతీదేవికి ఆడపిల్లలు లేకపోవడంవల్ల వినాయకుణ్ణి ఒకబాలికలా అలంకరించిందో!

---

తొమ్మిది పిల్లలు గల ఇల్లాలు చుట్టం చూపుగా వచ్చిన ఒకావిడతో తన కష్టాలు చెప్పుకుంటూ "ఏమిటోనమ్మా, ఏటేటా ఈ కాన్పులు! పిల్లలతో వేగలేకుండా ఉన్నాను. విసుగు పుడుతోంది," అంది.

రెండో ఆవిడ నవ్వుతూ "పోనీ, కనడం ఇంక ఆపివేయ రాదమ్మా?" అంది.

"అలాగే అనుకుంటాను నేనూ. కాని ఎప్పటికప్పుడు కడసారివాణ్ణి అతిగారాంచేస్తే, వాడేం పాడైపోతాడో అని భయం," అని ఇల్లాలు సమాధాన మిచ్చింది.

---

విహా! గణేశ్వరుని రెండు చెవుల చివర రెండు ఎర్ర తామరపువ్వులు జూకాల్లా వేలాడుతున్నాయి! అసలే చిన్నవిగా ఉన్న ఏనుగకళ్ళకు వల్లనికాటుక పెట్టడంవల్ల అవి కొంచెం విశాలంగా కనిపిస్తున్నాయి! కంఠంలో చిరుబొజ్జదాకా వేలాడే ముత్యాలహారాలు. కాళ్లకు బంగారుగజ్జెలు. నుదుటిమీద చిన్న చంద్రవంక!

ఈవిధంగా ఎదురుగా సుఖాసీనుడై ప్రత్యక్షమైన బాలగణేశ్వరుని చూచేసరికి వ్యాసునిమనస్సు బాగా కుదుటపడింది. ఆ సమయంలో ఆ ఇసుక తిన్నెలో పూజా ద్రవ్యాలు లభించక పోవడంవల్ల మహర్షి వేద మంత్రాలతోనే సంగ్రహంగా శివ కుమారునికి పూజచేసి తన మనోరథం సవినయంగా విన్నవించుకొన్నాడు.

"భారత మహాసముద్రం తరించడానికి దేవరవారి లేఖిని నాకొక చిన్న నౌక!" అన్నాడు!

విఘ్నేశ్వరుడు మహర్షికేసి క్షణకాలం నిశిత వీక్షణం ప్రసరింపజేసి, గంభీరంగా ఇలాగన్నాడు. అయితే—"నా లేఖిని నిరంతరాయంగా సాగిపోవలెను! అది నిలిచిన ఉత్తర క్షణంలోనే దానితో బాటు—నా సాహాయ్యమున్న నిలిచిపోగలదు!" అన్నాడు.

మొట్టమొదట పసిబాలకునిలా ప్రత్యక్షమైన పార్వతీ కుమారుని సందర్శించగానే వ్యాసుడు కొంతంత ధైర్యంపొంది ఈయన నాలుగు చేతులకు పూర్తిగా పని కల్పించవచ్చునని ఎంతో ఉత్సాహపడ్డాడు. కాని వినాయకుని మాటలు వినేసరికి ఆయన ఉచ్ఛ్వాస నిశ్వాసాలు నిలిచిపోయాయి!

కొంచెంసేపాలోచించుకొని "అయితే ఒక్క చిన్న మనవి. తమ కనవసరంగా కాలహరణం కానీయనుగాని, నా శ్లోక పరంపర పరమార్థం పూర్తిగా ఆకళించుకోకుండా తమరవి లిఖించడం మాత్రం న్యాయ్యం కాదు!" అన్నాడు.

విఘ్నేశ్వరుడు మళ్లీ క్రీగంటితో మహర్షి కళ్ళలో లోతులు గ్రహించుకొని "అవును! న్యాయ్యం కాదు!" అన్నట్టు చిరునవ్వులు చిందింప జేశాడు.

మరునాటి ప్రభాతవేళ భారత సంహిత రచన ప్రారంభం అయింది. వ్యాస శిష్యులు సేకరించ గలిగినన్ని తాళ పత్రాలు సంపాదించి గుట్టలు పోశారు. మహర్షి ముఖతః వేలాది శ్లోకాలు శరపరంపరల్లా వెలువడుతున్నాయి. పక్కనే సమాసీనులైన మహర్షులు, శిష్యులు జపతపాలు విడిచివేసి ఆ అద్భుతం చూచి తన్మయులై పోతున్నారు.

ఇంతలో విఘ్నేశ్వరుని చేతిలో బంగారు గంటం గమనం మందగించింది. వ్యాసునికి ముచ్చెమటలు పోశాయి. గంటం నడక ఇంకా మందగించింది. గణాధిపతి "ఏం మహర్షీ! నీ శపథం ఏమైనది?" అన్నట్టు అతనికేసి చూచి చిరునవ్వు నవ్వాడు! శిష్యులంతా దిగాలుపడి పోయారు!

మహర్షి భావనలో ఒక ఊహ మెరుపులా మెరిసింది. వెంటనే బ్రహ్మ భేద్యమైన పది శ్లోకాలు అక్కడక్కడ లో ఏకరువు పెట్టాడు.

మొట్టమొదట, విజ్ఞానం అంతా మూర్తీభవించిన వినాయకునికి కూడా అవి కొరకబడలేదు! అయినా అవి జాగ్రత్తగా అవగాహన చేసుకుంటూ కొంచెం నెమ్మదిగా వ్రాశాడు. ఇంతలో వ్యాసుడు మరొక పది వేల శ్లోకాలు మనస్సులోనే రచించుకొని ఏమీ ఎరగనట్టులాగే ఆ దివ్య లేఖకుని గంటం కేసి చూస్తున్నాడు.

ఇలాగే మధ్యమధ్య పణుగుల్లాంటి ఘట్టాల సాహాయ్యంతో వ్యాసుడు తన ప్రతిజ్ఞ నెరవేర్చుకుంటున్నాడు.

విఘ్నేశ్వరుడా మహర్షి అతిలోక ప్రజ్ఞకు తల పంకించి మందహాసం చేస్తూ— "మహర్షీ! నా అంతటి వ్రాయసకాని లేఖినికి కూడా నీ ఆర్ష బలంవల్ల, నీ ప్రజ్ఞ వల్ల అంతరాయం కలిగించావే! సాధు! సాధు!" అన్నాడు.

వ్యాసుడు సవినయంగా తన రెండు

(11-వ పేజీ చూడండి)

# భూషణం వైరాగ్యం

రమణ

"స్వామీ! స్వామీ! వింతచూశాను వివరించి చెప్పాలి" అన్నాడు గోప కుమారుడు—దశాశ్వమేధ ఘట్టంలో జపం చేస్తున్న మణిసిద్ధుడి వద్దకు పరుగున వచ్చి.

మాట్లాడకపోతే సతాయింపు తప్పదని అనుభవంమీద తెలుసుకున్న మణిసిద్ధుడు ధ్యానానికి ఉద్వాసన చెప్పి కళ్లు తెరచాడు. "వత్సా! గోపా! ప్రాణాంతకా. చెప్పు నీ సందేహం" అన్నాడు.

గోపన్న చెప్పాడు: "స్వామీ! ఇందాక అలా తిరుగుతూ, ఒక సత్రంలోకి వెళ్ళాను. పాతికేళ్లు పైబడని ఒక యువకుడి చుట్టూ చుట్టపక్కాలు చేరి పరిపరి విధాల బతిమాలుతున్నారు. అతగాడు, ఇవాళ ఇక్కడ బంగాళదుంప వదిలేస్తానంటున్నాడట. చివరికి బంగాళదుంపకూర, వేపడం మాత్రం వదిలేసేటట్లు ఒప్పిస్తున్నారు. ఈ ధర్మసూక్ష్మం ఏమిటి స్వామీ?"

మణిసిద్ధుడు మందహాసం చేశాడు. "గోపా. కలియుగ మానవులపై ఈ కూర ప్రభావం ఎంత ఉందో నీకు తెలియదు. అంత గొప్పకూర కాబట్టే, దానితో చేసే రెండు రకాల వంటకాలను, రెండు వేర్వేరు కూరలుగా పరిగణించి వర్జించమంటున్నారు." అన్నాడు.

"అంత మంచికూర అయితే, కందా చేమా కాకరకాయ ఉండగా, ఈ కూరనే వదిలేసేటంత విరక్తి ఎందుకు కలిగింది స్వామీ! పైగా, ఇరవై రెండేళ్ల పడుచు,- అతడి ఇల్లాలట—ఆమె కూడా ఆ కూరనే వదిలేస్తోంది. "ఏమా కథ స్వామీ?" అన్నాడు గోపన్న కుతూహలంతో.

దివ్యమణి ప్రభావంవల్ల ఆ కథ యావత్తూ కరతలామలకం చేసుకున్న వాడై, సిద్ధుడు గోప కుమారుడికి ఇలా తెలియ చెప్పాడు.

"ఓ గోపా. తుమ్మెద రెక్కలవంటి మీసాలుగల ఆ చిన్నవాడికి మొన్న మొన్ననే ఉద్యోగం అయింది. పేరు నాగభూషణరావు. వలచి వలపించుకున్న కన్నెను వెంటనే పెళ్ళిచేసుకుని, బొమ్మరిల్లువంటి చిన్న పెంకుటింట్లో కాపురం పెట్టాడు. ఆమె పేరు సుబ్బులు. ఒకపక్క వలపుతో తీయని కలలు కనడం, ఆ కలలగురించి మెలకువగా ఉన్నపుడు ఆలోచించుకోవడం, మరి ఖాళీగావున్నపుడు సినిమాపాటలు పాడుకోడం, అవీ విసుగెత్తినపుడు పాఠాలు చదువుకోవడం మొదలైన పనులవల్ల, ఆ పడుచు పాకశాస్త్రం ఏమంత బాగా నేర్చుకోడానికి వీలులేకపోయింది. ఫలానా కూరకి పోపులో మెంతులు వెయ్యవచ్చునా కూడదా, ఎన్ని మిరపకాయలు వెయ్యాలి- ఇత్యాది విషయాలలో అనుమానం వేస్తే, ఎక్కడిదక్కడ వదిలివేసి, పక్కవీధిలోనే వున్న పుట్టింటికి చెంగున పరుగెత్తుకెళ్ళి కనుక్కువచ్చేసేది. ఇలావుండగా ఒకనాడు భూషణరావు ఆఫీసుకువెళ్తూ సాయంత్రం సినిమాకి వెళదామని చెప్పాడు. సుబ్బులు ఐదుగంటలకల్లా నిప్పు రాజెయ్యడం మొదలుపెట్టి ఐదున్నరకే కుంపటి రాజేసింది. బంగాళదుంపలు అమ్మొచ్చాయి. బేరమాడి ఏబులం కొంది. వాటివంక తేరిపార చూచి, అవి చాలవనుకొని మరో ఏబులం కొంది.

"వాటిని తరిగినపుడుమాత్రం ఇద్దరికిన్నెందుకా అనుకొని, ఏబులమే తరిగి ఉడకేసింది. వాటిని దింపి బియ్యం పడేద్దామనుకుంటూనే మరోసారి చూచింది. కూర చాలదే అని ఆలోచిస్తూ అంచనా వేస్తూ ఉడికిన ముక్కలు తొక్కలు ఒలింది' చాలదని అప్పటికి నిర్ధారణచేసుకుని, చకాచక మిగతా దుంపలుకూడా తరిగేసి ఉడకవేసింది. ఐదునిమిషాలలో భర్త వచ్చాడు - వంటయిందా సినిమా కెళదాం అంటూ. అయిపోవచ్చింది మీరు మొహం కడుక్కుని పౌడరు వేసుకుని తయారవండి అంది సుబ్బులు ధీమాగా. అతగాడు ముస్తాబైపోయి, జటకా పిలవనా అంటూ వంటింట్లోకి వచ్చాడు. ఆలస్యం అవుతోందన్న ఆదుర్దాలో ఉడికీ ఉడకని బంగాళా దుంపముక్కలను దింపేసి వచ్చినంతవరకూ తొక్కలుతీసి ఉడికిన ముక్కలూ ఉడకని ముక్కలూ ఆదరాబాదరా గుచ్చెత్తి పోసేస్తోంది.

ఆ బంగాళ దుంపలకూర చూడగానే భూషణం గుండె గుభేలుమంది. ఏమే హాయ్ హాయ్ ఏమిటది హేమిటదీ అనేవాడు హడావుడిగా. ఆ కేకలువిని పాము తేలో కాబోలనుకున్న సుబ్బులు తుళ్లిపడింది.

"ఏమిటండీ, ఏమిటండీ" అంది భర్తవంక చూస్తూ.

"ఏమిటదీ, ఏమిటదీ" అన్నాడు భూషణం బంగాళ దుంపల కూరవంక చూస్తూ

"కూర".

"ఇది సత్రమా సంసారమా. ఇద్దరికోసం రెండువీశెల దుంపలా?" అన్నాడు భూషణం.

"రెండు ఏబులాలే, చాలవనుకుని వండాను."

"ఇద్దరికెంత కూర కొండాలో తెలియని నువ్వెందుకు పనికొస్తావు? తెలీకపోతే ఎవరినైనా అడగరాదా? పుస్తకాలుకొని చదవరాదా? ఇంత దుబారాచేస్తే ఎలా" అని భూషణం గదమాయించాడు.

సుబ్బులు బిక్కమొగం వేసింది. భూషణం అంతటితో ఊరుకోక, 'హుం' అని మరీ ఆగడంతో తిక్క తిరిగింది. గబగబా పోపు వేయించి, కూరముక్కలు అందులో పడేసి గిరగిరతిప్పి దింపి అక్కడ పెట్టి, చెంగుబిగించి, అవతలవీధిలో పుట్టింటికి చరచర వెళ్ళిపోయింది. ముస్తాబైన భూషణం మొహం ముడుచుకున్నాడు. ఎక్కడికి? ఎందుకు వెళ్తావువేళా ఈ లీ అని పలకరించలేదు. దగ్గరకుతీసుకుని సముదాయించలేదు. సరాసరి ఒక స్నేహితు

"పట్టుమని పాతికేళ్లు నిండని ఆచిన్నవాడికి అప్పుడే బంగాళ దుంపకూరమీద అంత విరక్తి ఎందుకు కలిగింది?" అని అడిగాడు గోపకుమారుడు.

"ఉడికీ ఉడకని కూర కిటుకు తెలియక" అన్నాడు మణి సిద్ధుడు మందహాసంచేస్తూ.

డింటికి బయల్దేరాడు. ఆయనగారుకూడా ప్రాణేశ్వరిమీద అలిగి, షికారు బయలుదేరారు. ఇద్దరూ కలిసి సాయంత్రం ఏడున్నర వరకూ తిరిగారు. కరకర ఆకలి వెయ్యడంతో, భూషణం స్నేహితుడు ఇంటి ముఖం పట్టాడు. భూషణంకూడా ఏం పాలుపోక జంకుతూనే అత్తారింటికి వెళ్లాడు.

అక్కడంతా పెందరాళే భోజనాలుచేసి ఆరుబయట వెన్నెట్లో పక్కవేసుకు పడుకున్నారు. ముందర వాకిట్లో మొగాళ్లు, వెనక పెరట్లో అత్తగారు, బామ్మగారూ మొదలైనవారూ పడుకుని కబుర్లాడుకుంటున్నారు.

వెళ్ళగానే మావగారు పలకరించాడు: "ఏం భూషణం. ఇవాళ ఐదింటికే భోం చేశావుట, అమ్మాయి చెబుతోంది" అన్నాడు.

భూషణం తెల్లబోయాడు: "సుబ్బులు అలా అని చెప్పింది కాబోలు" అనుకుని, ఆశ్చర్యపడి, తమాయించుకుని, 'మరేనండి. ముందర సినిమా కెళ్దాం' అనుకున్నాం. తర్వాత పనిమీద అలా వెళ్లాల్సొచ్చింది" అన్నాడు.

మావగారు అటువేపు తిరిగి వాళ్ల తోడల్లుడితో మాట్లాడుతున్నారు. తను వచ్చినట్లు మరదలుపిల్ల ద్వారా పెరట్లోకి కబురు వెళ్ళిందప్పుడే. పావుగంట గడిచినా సుబ్బులు అంతఃపురోద్యానవనం దాటివచ్చే ఛాయలు కనబడలేదు భూషణానికి. వాలుకుర్చీలో పడుకుని నీలాకాశంవంక చూశాడు. సుబ్బులు లేతమనసులో మొండితిక్కలా ఆకాశంలో మబ్బుపింజ ఒకటి చలనం లేకుండా ఉంది. కదలదేం అనుకున్నాడు. అతగాడికి ఆ సమయంలో మేఘ సందేశం జ్ఞాపకం వచ్చింది. రివ్వున గాలివీచి పెద్ద మబ్బుకమ్మితే పెరట్లోంచి సుబ్బులు, వాకిట్లోంచి తనూకూడా చెంగున సావిట్లోకి దూకితీరవలసిందే ఎవరూ ఓడినట్లవదు.

ప్రాధేయపూర్వకంగా చూశాడు కాని సుబ్బుపిల్ల మనసు కరగలేదు. అందుకని మరదలు పిల్లని పిలిచాడు.

"సరేలే కానీ మంచినీళ్లు తెమ్మను" అన్నాడు.

'అక్కర్లేదుట' అన్న జవాబు, కాసిని మంచినీళ్లు పట్టుకుని మరదలుపిల్లే తిరిగి వచ్చింది, భూషణం కోపగించుకుని, మళ్లా షికారెళ్ళిపోయాడు. ఆకలి వేస్తున్నా, తిక్క మూలాన, చిరుతిళ్లు తిన బుద్ధి కాలేదు. పదిన్నరకి ఇల్లు చేరాడు. ఓరగిలా ఉన్న తలుపుతీసి లోపలికి వెళ్లాడు.

సుబ్బులు నిద్రపోతోంది. భూషణం కూడా మాట్లాడకుండా పడుకున్నాడు కాని, ఆకలివల్ల నిద్ర రాలేదు. అలవాటు ప్రకారం, అతి నెమ్మదిగా లేచి వంటింట్లోకివెళ్ళి గిన్నెలు తడిమాడు. అన్నం గిన్నం లేదు. బంగాళ దుంపల కూర మాత్రం ఉంది. అదే కాస్త తినబోయాడు కాని కూర ఏమీ ఉడకలేదు. ఆకలిమూలాన, అదే బలవంతాన కాస్త తినేశాడు. మజ్జిగ గిన్నె చూస్తే ఖాళీగా ఉంది. మర్నాటికని తోడేసిన పాలు కనబడ్డాయి. కళ్లు మూసుకుని తాగేశాడు. దడీ చప్పుడూ లేకుండా వచ్చి పడుకున్నాడు. "జన్మలో ఇక బంగాళదుంప కూర తినకూడదు" అని నిద్ర పోయేముందు ఒట్టు పెట్టుకున్నాడు. అంత విరక్తి కలిగింది ఆ కూర తిన్నాక.

తెల్లవారాక ఒకర్నొకరు ఎలా పలకరించుకోవాలో తోచక తిప్పలు పడుతున్న ఆ జంట పాలిట దేవతలల్లే భూషణరావు తల్లి తండ్రులు అప్పచెల్లెళ్లు బిలబిల మంటూ బండి దిగారు. "అనుకోకుండా కాశీయాత్ర ముహూర్తం పెట్టుకున్నాంబాబూ నువ్వూ నీ పెళ్లాం కూడా బయల్దేరండి" అని ఆజ్ఞాపించాడు భూషణం తండ్రి. ఆ తరవాతి గలభాలో సుబ్బులు భూషణం మాట్లాడుకున్నారు కాని, మనసు విప్పి కాదు. నువ్వు ఇందాక వెళ్ళేసరికి తర్జన భర్జన జరగడానికి కారణం అదే. పెళ్లానికి బంగాళదుంపకూర వండడం రాదని, అందువల్ల వదిలేయడం ఉత్తమమనీ భూషణం గట్టిగా నిశ్చయించుకున్నాడు. ఆరోజు రాత్రి బలవంతాన ఆ ఉడికీఉడకని కూరతో కడుపు నింపుకోవడంవల్ల పూర్తిగా అదంటే వెలపరం విరక్తి కలిగాయి. ప్రాణేశ్వరుడే వదిలేస్తూఉంటే తనకుమాత్రం ఎందుకని ఆపిల్లకూడా ఆకూరే వదిలేస్తోంది. ఉడకని కూర తినడమే మొగుడి విరక్తికి కారణమని ఆ ఇల్లాలికి తెలియదు. తెలిస్తే అసలు రహస్యం చెప్పి వేసేదే. ఆ రహస్యం తెలియనందువల్లనే ఆచిన్నవాడుకూడా తనభార్యకి అసలు బంగాళదుంప వండడంచేతకాదని నిర్ధారణ చేసుకున్నాడు. చుట్టాల రాకవల్ల కాశీయాత్రవల్ల ఈ రహస్యం మరుగున పడింది."

గోపన్న కథవినగానే లేచినించున్నాడు. "స్వామీ తాము వెంటనే ఆ రహస్యం నాకు తెలియచెప్పండి. నేను పరుగునపోయి ఆ ప్రమాదానికి అడ్డుపడతాను" అన్నాడు.

మణిసిద్ధుడు నవ్వి ఇలా అన్నాడు:

"ఆరాత్రి తొమ్మిదిగంటలవేళ ఇల్లుచేరిన సుబ్బులు ఆకలికొద్దీ, ఆ ఉడికీ ఉడకని బంగాళదుంపల కూరలో ఉడికినదంతా తినేసి, మజ్జిగతాగి పడుకొంది. గంటన్నర తరువాత అవురావురుమంటూవచ్చి, ఉడకని కూరముక్కలుతిన్న భూషణం ఈరహస్యం తెలియక, భార్య వంటసామర్థ్యమే అంత అని అపోహపడి ఇప్పుడు ఆకూర వర్జిస్తున్నాడు అందువల్ల ఓగోపా ..."

గోపకుమారుడు చెంగున గంతువేసి, స్నానాలరేవుకు రివ్వున పరుగుతీశాడు. ★

హైస్కూలు తెలుగుపండితుని ఇంట్లో అర్ధరాత్రివేళ దొంగ పడ్డాడు. పండితునికి మెలకువ వచ్చింది. దొంగ కత్తి తీసి బెదిరించాడు: "అరిచారంటే పొడిచేస్తాను. నేను మీ డబ్బు ఎక్కడుందో వెదుకుతున్నాను."

"కాస్త ఓపిక పట్టవయ్యా. దీపం వెలిగిస్తాను. ఇద్దరంకలిసే వెదుకుదాము," అన్నాడు పండితుడు.

## వ్యాసుని వ్రాయసకాడు

(9 వ పేజీ తరువాయి)

చేతులూ జోడించి, తలవంచి..."ఎంతమాట! దేవరవారి అంతరాయం కలిగించకపోవడం వల్లనే గదా, నా ప్రజ్ఞాబలం పని చేసేది!" అన్నాడు.

వినాయకుడు "గంటం నిలిపి, సగౌరవంగా వ్యాసునికేసి చూసి—

"ఔరా! ఎంతటి మాటకారివయ్యా! మహాకవీ!" అని మెల్లిగా భుజం నిమురుతుంటూ ఒక్కసారిగా కలకల నవ్వాడు!

చుట్టూరా ఉన్న ఋషిగణం ఆనంద కోలాహలం మిన్ను ముట్టింది! ★

# టెలిఫోను కథ

"అయితే, నువ్వు ఊరికి రాదలచుకో లేదన్నమాట"

"నా వల్ల కాదు. తీరుబడి లేదు."

"పోనీ స్టేషన్‌కేనా వస్తావా. దిగబెట్టడానికి?"

"దానికేం భాగ్యం. అలాగే"

ఊరికి రమ్మని బ్రతిమాలిన అమ్మాయి పేరు మేబెల్.

ఆమెను ప్రేమించి పెళ్లిచేసుకోదలచిన యువకుడు, అన్నమాట ప్రకారం, సాగనంపడానికి స్టేషన్‌కి వెళ్ళాడు. రైల్లో కూర్చుని ముచ్చటలాడుతున్న మేబెల్, రైలు కదలగానే ఒక్కసారిగా ఏడవడం మొదలుపెట్టింది. ఆ అబ్బాయి ఆశ్చర్యపడ్డాడు. కంగారు పడ్డాడు. సంగతి బోధపడక, చటుక్కున రైలెక్కిపోయాడు.

## జి. ఎన్. రాధాకృష్ణ

"టిక్కెట్టు కూడా లేకుండా రైలెక్కిపోయాను నీ కంట నీరు చూసి. ఎందుకు ఏడుస్తున్నావు?" అన్నాడు

మేబెల్ పక్కున నవ్వింది. "ఫిలడెల్ఫియా రావయ్యా వచ్చి, నీ టెలిఫోన్ సంగతి నువ్వే స్వయంగా చెప్పి ప్రదర్శించవయ్యా అని మర్యాదగా చెబితే విన్నావూ?" అంది.

జరిగిన మోసం గ్రహించగానే అతనికి కోపం వచ్చేసింది. వచ్చికూడా చేసేదేం లేదు.

"బడి పనివల్ల తీరుబడి లేదని శతవిధాల చెబితే నువ్వు చేసిందిదా.. హు. మొత్తానికి నీ పంతం నెగ్గించుకున్నావు" అని విసుక్కున్నాడు గ్రహాం బెల్.

గ్రహాంబెల్ అని ఒక అసామీ ఒకమూల ఉన్నాడనీ, ఆయన టెలిఫోన్ అనే ఒకయంత్రం కనిపెట్టాడనీ, ఫిలడెల్ఫియాలోని ఎగ్జిబిషన్‌లో ఒక మారుమూల ఆ యంత్రం ఉన్నదనీ తొలిసారిగా నలుగురికీ తెలియడానికి రెండుమూడు రోజుల ముందుగా, బెల్‌కి మేబెల్ ఈ టోకరా ఇచ్చింది.

గ్రహాంబెల్ ఒక యంత్రం కనిపెట్టాడు. దాని ద్వారా దూరదూరంగా ఉన్న ఇద్దరు మనుష్యులు మంచీ చెడ్డా మాట్లాడుకోవచ్చును. ఈ యంత్రం సంగతి ఎవరూ వినలేదు. విన్నా, 1876లో జనం, దీన్ని నీలి వార్త అనేసి ఊరుకునే వారు.

1876 లో ఫిలడెల్ఫియాలో ఒక ఎగ్జిబిషన్ ఏర్పాటయింది. అక్కడ రకరకాల



టెలిఫోను కనిపెట్టిన అమెరికన్ శాస్త్రజ్ఞుడు అలెగ్జాండర్ గ్రాహాంబెల్.
(ఆయన మనుమరాళ్లతో)





కొత్త యంత్రాలు ప్రదర్శిస్తున్నారు. శాస్త్రజ్ఞులు, పెద్దలూ వాటిని పరిశీలించి నిగ్గు తేల్చేవారు. వారు గొప్పదని ఎన్నిక చేస్తే, అది లోకం దృష్టిలోకి వస్తుంది. దాని మీద పరిశోధనలు సాగించడానికీ, అభివృద్ధి చెయ్యడానికీ దోహదం లభిస్తుంది...

గ్రహాంబెల్ యంత్రాన్ని చూసిన హబర్డ్ అనే పెద్దమనిషి, దాన్ని ఫిలడెల్ఫియా ఎగ్జిబిషన్‌లో పెట్టమని ప్రోత్సహించాడు. ఆయన ఎగ్జిబిషన్ విద్యాశాఖను చూస్తున్నాడు. సరేనని బెల్ దాన్ని పంపించాడు. ఎగ్జిబిషన్‌లో బెల్ యంత్రానికి ఒక మారు మూలచోటు ఇచ్చారు.

ఇది చూసి, బెల్ స్వయంగా అక్కడికి వెళ్ళి తన యంత్రం గురించి పరీక్షాబృందానికి తెలియజెప్పి, దానిచేత పనిచేయించి చూపించడం అవసరమని హబర్డ్ చెప్పాడు.

ఆయన బెల్‌కు కాబోయే మామగారు. "నువ్వు వచ్చితీరాలబ్బాయ్!" అని శత విధాల నచ్చచెప్పాడు.

బెల్ అప్పుడు బాస్టన్‌లో చెవిటి మూగ పిల్లల బడిలో పనిచేస్తున్నాడు. ఆబడిలో పరీక్షలు జరుగుతున్నాయి. అందుకనిససేమిరా బడివదిలి వచ్చేదిలేదన్నాడు.

హబర్డ్‌కి ఆశపోక, తనకూతురు మేబెల్‌ని చెప్పిచూడమన్నాడు.

మేబెల్ చెప్పినాకూడా బెల్ ఒప్పుకోలేదు.

"పరీక్షల మధ్యలో వెళ్ళిపోయి పిల్లలికి అన్యాయం చెయ్యమంటావా" అన్నాడు.

"సరే నేను వెళ్తున్నాను. క్షేమనుకయినారా" అంది మేబెల్.

రైలు కదులుతూఉండగా ఒక్కసారిగా మేబెల్ ఏడవడంతో, బెల్‌కి దెంబేలెత్తిపోయి రైలెక్కిపోయాడు.

చేసేదిలేక విసుక్కుంటూ ఫిలడెల్ఫియా వెళ్ళాడు.

1876 జూన్ నెలలో ఒక ఆదివారంనాడు కొత్తయంత్రాల పరీక్షకు ముహూర్తం పెట్టారు. గ్రహాంబెల్ చక్కగా ముస్తాబై ఎగ్జిబిషనుకు వెళ్ళాడు. అక్కడ విద్యుచ్ఛక్తితో పనిచేసే కొత్తయంత్రాలు చాలా ఉన్నాయి. బ్రాజిల్ చక్రవర్తి డాంపెడ్రో, అనాటి ప్రముఖ విద్యుచ్ఛక్తి శాస్త్రజ్ఞుడు సర్ విలియం థాంప్సన్, లార్డ్ కెల్విన్ ప్రభృతులు పరీక్షకులు.

ఆబృందం ఒకదాని తరువాత ఒకటి చూడసాగారు. తన యంత్రం చూడాలన్న ఆదుర్దా బెల్ మనసులో ఎక్కువైనకొద్దీ పరీక్షకులలో ఓర్పు తగ్గసాగింది. 'ఇవాళకింక చాలు పోదాం' అన్న విసుగుదల గోచరించసాగింది.

ఎలిషాగ్రే అనే ఆయన ఒక యంత్రం తయారుచేశాడు. అది సంగీత స్వరాలను ప్రసారం చేయగలదు. దాన్ని గురించి ఆయన ఎడతెరిపి లేకుండా అదేపనిగా చెప్పుకుపోతున్నాడు. బాగానేఉంది కాని, ఎంతకీ తెమలదేం అనిపించింది. కొంతసేపటికి అది తెమిలింది.

తన యంత్రంచూస్తారనుకున్నాడు బెల్. 'ఇవాళ కింకచాలు' అనేశారు పరీక్షక బృందం అధ్యక్షుడు.

బెల్ ప్రాణంఉసూరుమనిపించింది. ఇవాళ చూడకపోతే ఇంకెపుడూ చూడరన్నమాటే. పైగా తనువెంటనే బోస్టన్ వెళిపోవాలి.

ఉద్వేగపూరితమైన ఈ సన్నివేశం గురించి బెల్ స్వయంగా ఇలా వ్రాసుకున్నాడు.

"పరీక్షకులంతా వెళ్ళిపోసాగారు. నాయంత్రం చూడనట్టేఅని గుండె దిగజారిపోయింది నాకు. అంతలో బ్రాజిల్ చక్రవర్తి పెడ్రో నన్ను చూచి పలకరించారు.

బాస్టన్ బడిలో ఆయననన్ను అదివరకు చూశారు.

'మీ బళ్ళో పిల్లలు కులాసాగా ఉన్నారా?" అని చక్రవర్తి అన్నారు.

"ఆహా సుఖంగా ఉన్నారండి... మరండి...నేను కనిపెట్టిన యంత్రం ఇక్కడే ఉంది...పక్కదే" అన్నాను నేను హడావుడిగా.

అలాగా అంటూ ఆయన నాచెయ్యి పుచ్చుకుని నాతో బయల్దేరారు. చక్రవర్తి నాతో రావడంతో, మిగతా వారంతా గొర్రెలమందల్లే మావెంట వచ్చేశారు."

సరే అంతా రాగానే బెల్, చక్రవర్తిని ఒక బల్లదగ్గర కూర్చోమన్నాడు. టెలిఫోన్ శ్రవణయంత్రం ఆయన చెవిదగ్గర పెట్టుకోమన్నాడు. అదేమిటో ఏంచేస్తుందో ఎవరికీ తెలీదు.

బెల్ పక్కగదిలోకి వెళ్లాడు. టెలిఫోన్ యంత్రంలో అతి స్పష్టంగా, ఎంతో నెమ్మదిగా మాట్లాడాడు.

చక్రవర్తి కొంచెంసేపు విని కనుబొమలు పైకెత్తాడు. ఆశ్చర్యం వెలిబుచ్చాడు.

"ఇది మాట్లాడుతోంది" అన్నాడు ఒక్కసారిగా అందర్నీ కలియచూస్తూ.

తరవాత విద్యుచ్ఛక్తి శాస్త్రజ్ఞుడు సర్ విలియం థాంప్సన్ దాన్ని చెవిదగ్గర పెట్టుకున్నాడు.

ఆ యంత్రం గొట్టంలో మానవకంఠం విని

అని, ఒక్కసారిగా, లేచి, "ఇది నిజంగా మాట్లాడుతోంది ఇంత అద్భుతమైన దాన్ని నే నెక్కడా చూడలేదు... కొన్నాళ్లుపోతే మిత్రులు, విద్యుచ్ఛక్తి తీగమీదుగా రహస్యాలు మాట్లాడుకోవచ్చును" అన్నాడు.

"ఆ క్రితం రోజు రాత్రి నేను ఒక అనామకుడిని. తెల్లవారేసరికి, యశస్విని. చాలా పెద్దవాడిని. గొప్పవాడిని...దీనికి కారణం షర్ విలియం థాంప్సన్. ఆయన కిది తెలియడానికి కారణం చక్రవర్తి డాంపెడ్రో. ఆయన నన్ను గుర్తించి ఇంత చెయ్యడానికి మూలకారణం బాస్టన్ బడిలోని మూగ, చెవిటిపిల్లలు" అని టెలిఫోన్ కనిపెట్టిన గ్రహాంబెల్ వ్రాసుకున్నాడు.

టెలిఫోన్ అన్నది గ్రీకు పదం. దూరం నించి వినబడే స్వరం అని అర్థం.

ప్రయోగాత్మకంగా కాకుండా వాడుకకు వీలైన టెలిఫోన్ కనిపెట్టినవాడుగా గ్రహాంబెల్ పేరు అధికార రీత్యా గుర్తించబడింది. 1874 ఫిబ్రవరి 14 న తొలిసారిగా. 1877 లో మలిసారిగా టెలిఫోన్ పేటెంటు ఆయన కిచ్చారు. అంతకు చాలకాలం క్రితమే-1837 లో చార్లెస్ జి. పేజ్ అనే ఆయన విద్యుచ్ఛక్తి ద్వారా శబ్దాన్ని పంపవచ్చునని కనుగొన్నాడు. కాని ఇదమిత్థంగా దాన్ని నిరూపిస్తూ ఉపయుక్తమైన దేదీ చేయలేదు. అలాగే 1861 లో ఫిలిప్ రీస్ అనే జర్మన్ శాస్త్రజ్ఞుడు సంగీత స్వరాలు ప్రసారం చేసే యంత్రం ఒకటి తయారు చేశాడుగాని, ఉపయుక్తమైన దేదీ చెయ్యలేదు. ఇంకా అనేకమంది టెలిఫోన్ కనుగొన్నామన్న పేరు తమ దన్నారు. ఎలీషా గ్రే అనే ఆయన పేటెంటు ఆఫీసుకు నోటీసు ఇచ్చారు. అదే రోజున అక్కడ బెల్, తొలిసారి పేటెంట్ తీసుకున్నాడు.

అమెరికాలో 850 లక్షల టెలిఫోన్లు ఉన్నాయి. సగటున ప్రతి నలుగురికీ ఒక్కొక్కటన్నమాట. స్వీడన్‌లో ప్రతి ఐదుగురికీ, కెనడాలో ప్రతి ఆరుగురికీ ఒక్కొక్క టెలిఫోన్ చొప్పున ఉన్నాయి. మన దేశంలో ......సగటున 1800 మందికి ఒక టెలిఫోన్ ఉంది! ఐదువందల మందికి ఒకటి లభ్యం చేయడం రెండవ ప్రణాళిక లక్ష్యం. 1948 మే నెలలో బెంగుళూరులో 'ఇండియన్ టెలిఫోన్ ఇండస్ట్రీస్' పేరిట, ఒక టెలిఫోన్ కర్మాగారం నెలకొల్పారు. ఈ కేంద్రం దిన దిన ప్రవర్ధమానమై, నేటికి ఉత్పత్తి పరిమాణంలోనూ, సరుకు నాణ్యతలోనూ చురుకుగా ముందడుగు వేస్తోంది. నిర్ణీత లక్ష్యాలు కూడా అధిగమిస్తోంది. ఆసియాలో కొన్ని దేశాలవారు ఈ ఫ్యాక్టరీనుండి పరికరాలు కొనుక్కోవాలని ఆకాంక్షిస్తూ ఉండడం మనకి గర్వకారణం.

టెలిఫోన్ అతి చురుకుగా వ్యాపించింది. దాని 'మాతృదేశం' అమెరికా. ఈనాడు అమెరికాలో 850 లక్షల టెలిఫోన్లు - ప్రపంచంలో ఉన్న టెలిఫోన్లలో దాదాపు సగం, ఉన్నాయి. దాదాపుగా, ఇవన్నీ 'బెల్ టెలిఫోన్ సిస్టం' క్రిందనే పనిచేస్తాయి. ప్రపంచం మొత్తంమీద టెలిఫోన్లలో నూరింట 96 వరకూ కూడా ఈ 'సిస్టం' క్రిందనే పనిచేస్తాయి.

## టెలిఫోన్ ఎలా పనిచేస్తుంది?

నిశ్చలంగా ఉన్న చెరువులో చిన్నరాయి పడవేస్తే చక్రాలు చక్రాలుగా తరంగాలు బయలుదేరి అంతకంతకు పెద్దవవుతూ తరలిపోతాయి. మనం మాట్లాడే మాటకూడా అంతే. టెలిఫోన్‌లో మాట్లాడితే ఈ శబ్ద తరంగాలు విద్యుత్తరంగాలుగా మారుతాయి.

మనం మాట్లాడే గొట్టంలో ఒక పల్చటి గుండ్రటి రేకుబిళ్ల ఉంటుంది. ఇది విద్యుత్ప్రవాహంలో ఒక భాగంగా అమరి ఉంటుందన్నమాట. మనం అనే మాటలవల్ల బయలుదేరే శబ్దతరంగాలనుబట్టి ఈ రేకు రెపరెపలాడినట్లుగా ముందుకు వెనక్కు ఆడుతుంది. ఇది ముందుకువచ్చినపుడు విద్యుత్ప్రవాహం కొంచెం బలహీనం అవుతుంది. వెనక్కు వెళ్లినప్పుడు బలంగా ప్రవహిస్తుంది. దీనివల్ల మన శబ్దతరంగాలు విద్యుత్తరంగాలుగా మారిపోయి తీగలో ప్రవేశిస్తున్నాయన్నమాట. ఈ తరంగాలు మహావేగంగా, తీగ అవతలచివరకి, అదెంతదూరమైనాసరే వెళ్లిపోతాయి. అక్కడ, విద్యుచ్ఛక్తి ప్రవహించినపుడుమాత్రం ఆకర్షణశక్తిని సంపాదించే ఇనుపకడ్డీల జోడీ ఉంటుంది. దాన్ని ఎలక్ట్రోమాగ్నెట్ అంటారు. వాటిని ఇంచుమించు అంటిపెట్టుకున్నట్టుగా మరో పల్చటి గుండ్రటిరేకు ఉంటుంది. విద్యుత్తరంగాలు ఎలక్ట్రోమాగ్నెట్‌లోకి వెళ్లగానే, ఆ తరంగాల బలాబలాల ప్రకారం ఆ మాగ్నెట్, దానిఎదటఉన్న రేకుని ఆకర్షిస్తూ ఉంటుంది. మాట్లాడినచోట బయలుదేరిన శబ్దతరంగాలు, అక్కడిరేకు రెపరెపలాడడంవల్ల విద్యుత్తరంగాలుగా మారాయి కాబట్టి, ఈ వినేచోట ఉన్న రేకు సరిగ్గా అదేక్రమంలో అదేప్రకారం ఆడుతుంది. అందువల్ల అక్కడ ఉచ్చరించిన శబ్దమే ఇక్కడ తిరిగి బయలుదేరుతుంది. అంటే ఇంచుమించు ఇవంతా తర్జుమాతతంగం అన్నమాట. 

డిటెక్టివ్ సీరియల్

# అపూర్వ హంతకులు

మూలం: ఎడ్గార్ వాలెస్ అనువాదం: 'వినాయక'

## 4

## సన్నాహాలు

"బ్లాకులతయారీలో చాలాకాలంనించి పేరుమోసిన వ్యాపార సంస్థ! వెంటనే అమ్మకానికి సిద్ధం! సరికొత్త యంత్రాలు! రసాయనద్రవ్యాలు కొల్లలు!" అని ఒకానొక పత్రికలో పడిన ప్రకటన చూడగానే ముద్రణ వ్యాపారంలో మునిగి తేలేవాళ్ళందరికీ ఈ ప్రకటన లోతుపాతులన్నీ తెలిసిపోయాయి. ఇది చవకరకం త్రివర్ణచిత్రాలు తయారుచేసేసంస్థ అనీ, ఈ వ్యాపారంలో ఇంతటి చెడ్డపేరు తెచ్చుకొన్నది ఇంకొకటి ఏదీలేదనీ, ఇక్కడ తయారయ్యే బొమ్మలుకూడా కొంచెం గిరాకీగానే ఉంటాయనీ. దీనికి సంబంధించిన వ్యాపారస్థులంతా అనుకున్నారు.

ఇక బ్లాకుల తయారీ అంటే ఏమిటో బొత్తిగా తెలియని వాళ్ళకిమాత్రం దీన్ని గురించి చాలా చిత్రమైన ఊహాలు పుట్టుకొస్తాయి. వీళ్ళంతా ఇక్కడ కళ్లు జిగేల్ మనిపించే విద్యుద్దీపాలు వెలుగుతూంటాయనీ చిన్నరంపాలటూ ఇటూ కదులుతూంటాయనీ, కొందరు పనివాళ్ళేదేపనిగా ఏవేవో చెక్కుతూంటారనీ అనుకుంటారు.

కొంచెం తెలిసినవాళ్ళిక్కడ చిత్రాలకు బ్లాకులు తయారుచేస్తారనీ, ఇవి అచ్చుపనికుపయోగిస్తాయనీ గ్రహిస్తారు. అయితే ఈ సంస్థ గడిచిన మూడు నెలలనించీ 'అమ్మకానికి సిద్ధం' గానే ఉంది. అయినా ఇది పెద్ద పెద్ద దినపత్రికలకు వేటికీ అందుబాటులో లేదు. ఎక్కడో మారుమూల మూలుగుతూ ఉంది. యంత్రాలు అన్నీ బాగా తుప్పుపట్టిపోయాయి. ఇందుచేత ఎగబడి కొనేవాళ్ళెవళ్ళూ కనబడలేదు.

మాన్‌ఫ్రెడ్ ఈ సంగతి పసిగట్టాడు. వెంటనే ఈ కంపెనీ ట్రస్టీల దగ్గిరికి వెళ్లాడు. వాళ్లీసంస్థ అంతా కవులు కివ్వడానికికూడా సిద్ధపడ్డారు. కొనుక్కుంటే మరీ మంచిద న్నారు. ఏది చేసినా వెంటనే మీ కిది స్వాధీనం చేసేస్తామన్నారు. ఈ సంస్థ భవంతి చిట్టచివరి అంతస్థుమీద కుటుంబంతో సహా సుఖంగా ఉండడానికి తగిన హంగులన్నీ ఉన్నాయి. ఒక బ్యాంకేదైనా కొంచెం హామీయిస్తే చాలు! వెంటనే ఈ భవనంలో ప్రవేశించవచ్చును. ప్రస్తుతం ఈ వ్యాపారం అంతా అప్పులవాళ్ళపాలై పోయింది. ట్రస్టీ ఒకడు ఆ తరవాత వారితో భవంతి అమ్మకం విషయమై ప్రసంగిస్తూ ఇలా అన్నాడు:

"ఈ అబ్బి ఎవడో గాని ఒట్టి వెర్రి వెంగళప్పలా ఉన్నాడే! చవకబారుగా బొమ్మలమ్మి జేబులు నింపుకోవచ్చునని గుటక లేస్తున్నాడులే! ఒక చిన్న లిమిటెడ్ కంపెనీ ప్రారంభిస్తాననీ, వెంటనే ఇదంతా కొనేస్తాననీ చెబుతున్నాడు."

సరీగా అది అలాగే జరిగింది!

ఆ వేళ సాయంత్రమే అయిదుగురు పెద్ద మనుషులు కంపెనీల రిజిష్ట్రారుక్కేర ఒక జాబు రాశారు. దానిలో తామొక లిమిటెడ్ కంపెనీ పెట్టాలని నిశ్చయించామనీ ఇది సభ్యుల సమాన వాటాలమీద నడపాలదనీ బ్లాకులు చెయ్యడమే దాని పరమలక్ష్యమనీ తెలియజేశారు.

ఈ అయిదుగురిలోను మొదటివాడు థామస్ బ్రౌన్; - ఇతగాడు వర్తకుడు. రెండోవాడు ఆర్థర్ నైట్ - పేరుమోసిన పెద్దమనిషి. మూడోవాడు జేమ్స్ సెల్కర్క్ - చిత్రకారుడు. నాలుగో మనిషి, ఆండ్రూ కోహెన్, - పెట్టుబడి వ్యవహారాలు చూసే అసామీ. అయిదో ఆయన జేమ్స్ లీచ్ - ఒక గొప్ప కళావేత్త.

నిజానికి మన మాన్‌ఫ్రెడే, ఈ 'మహా కళావేత్త!'

పార్లమెంటులో విదేశీయ బహిష్కరణ శాసనం రెండోసారి చర్చ ప్రారంభం కావ

**జరిగిన కథ:-**

స్పెయిన్ దేశంలో ప్రభుత్వానికి వ్యతిరేకంగా తిరుగుబాటు జరుగుతున్న రోజుల్లో విప్లవకారులు ఇంగ్లాండులో మకాం వేశారు. వాళ్ళని వెళ్ళగొట్టడంకోసం ఆంగ్లదేశమంత్రి పార్లమెంటులో ఒక చట్టం ప్రవేశపెట్టాలని అనుకున్నాడు.

న్యాయపరిరక్షణభారం వహించిన నలుగురు 'అపూర్వ హంతకులు' ఆ చట్టం ప్రవేశపెడితే మంత్రిని చంపివేస్తామని బెదిరిస్తూ ఉత్తరం రాశారు. 'బాకా' పత్రిక ఆ ఉత్తరం నకలు ప్రకటించడంతో ఊరూ వాడా గుప్పుమంది.

పార్లమెంటులో ఈ చట్టం ప్రవేశపెట్టే ముందు ఒకసభ్యునికి ఒక ఉత్తరం అందింది. అది 'అపూర్వ హంతకులు' పార్లమెంటు సభ్యులను చట్టం ఆమోదింపజేయవద్దని హెచ్చరిస్తూ రాసిన బెదిరింపు ఉత్తరం! దీనితో పార్లమెంటుసభ్యులలో పెద్ద అల్లకల్లోలం బయలుదేరింది! తరవాత నిజాయితీపరులు నలుగురు లిమిటెడ్ కంపెనీ పెట్టి ఒక పెద్దభవనం అద్దెకు తీసుకుని దానిలో హత్యాసన్నాహాలు ప్రారంభిస్తారు.

"నా గొడుగు ఎక్కడ మర్చిపోయానో జ్ఞాపకం రావడం లేదోయ్" అన్నాడు ఒక ఆసామీ.

"అసలు మర్చిపోయినట్లు ఎలా జ్ఞాపకం వచ్చిందీ?" అన్నాడు రెండో ఆసామీ.

"ఇందాక బాగా వాన కురిసింది కదూ. వాన వెలిశాక గొడుగు ముడిచేద్దామని చెయ్యి ఎత్తితే గొడుగు కనిపించలేదు. అప్పుడు జ్ఞాపకం వచ్చింది," అన్నాడు మొదటాయన!

డానికి గడువింక అయిదు రోజులే! ఈలోగానే ఈ కొత్త కంపెనీ యజమానులు తమ నూతన భవనంలో గృహప్రవేశం జరుపుకున్నారు. వెంటనే వ్యవహారం ప్రారంభం చేశారు.

తరువాత ఒకనాడు మాన్‌ఫ్రెడ్ మిగిలిన వారితో ఇలాగన్నాడు.

"నేను కొంతకాలంకిందట ఒక చిన్న పనిమీద లండన్ వచ్చాను! అప్పుడిక్కడ లిమిటెడ్ కంపెనీ పేరుతో ఎలాంటి రహస్య వ్యాపారాలైనా సాగించవచ్చునని గ్రహించేశాను. 'లిమిటెడ్' అనే మాటలో ఇక్కడ ఎంతైనా పెద్దమనిషితరహా కనబడుతుంది. కంపెనీ డైరక్టరుగా రనగానే నలుగురు 'ఓహో!' అంటే 'ఓహో!' అంటారు. నువ్వు ఏమిటి చెయ్యి! ఎవ్వడికీ పిసరంతైనా అనుమానం పుట్టదు.

గోన్సాలెజ్ "అక్టోబరు 1 వ తేదీనించీ వెంటనే ఈ కొత్త 'చిత్రకళా సమితి'లో పని ప్రారంభం అవుతుంది" అని ఒక ప్రకటన ఆ కంపెనీ భవంతి ఎదురుగా వేళ్ళాడగట్టాడు. దానికింద "ఉద్యోగాలు లేవు" అని ఇంకో నోటీసు అతికించాడు. ఇంకా కొంచెం కింద "ఉత్తరాలన్నీ మేనేజరు పేర రాయాలి. ఆయన్ని చూడాలంటే ముందుగా దరఖాస్తు పెట్టుకుని వారి అనుమతిమీదనే దర్శనానికి రావాలి." అని ముక్తసరిగా ఇంకో ప్రకటన తగిలించాడు. ఈ కంపెనీ వీధిగుమ్మందగ్గిర పెద్ద ఆర్భాటం ఏమీ లేదు. భవంతి నేలమాళిగలో పాడైపోయిన పాతయంత్రాల విడివిడిభాగాలన్నీ చిందర వందరగా పడిఉన్నాయి. భవంతి లోపలికి వెళ్ళగానే ముందుగా ఒకవైపున కొత్త కంపెనీ ఆఫీసు కనబడుతుంది. మరో వైపున విరిగిపోయిన కుర్చీలు, పాత దస్త్రాలు గుట్టలు గుట్టలుగా పడిఉన్నాయి.

ఇంకా కొన్ని పాతకాలంనాటి బీరువాల అరలలో అరిగిపోయిన బ్లాకులు, ఏవేవో చిల్లరమల్లర కాగితాలు, రసీదులు, చెత్త, చెదారం మొదలైనవన్నీ కంటబడతాయి.

ఇంతకుపూర్వం ఈ భవంతి మొదటిఅంతస్థులో వర్క్‌షాపు ఉండేది. రెండో అంతస్థు సామానులు నిలవచేసుకోడాని కుపయోగించేవారు. ఇక మూడో అంతస్థు మాట. ఇది ఈ భవంతి కంతటికీ ముఖ్యమైనది. దీనిలో పెద్దపెద్ద కెమేరాలు, ఆర్క్‌లైట్లు అమర్చారు. ఇవన్నీ ఈ వ్యాపారానికి చాలా అవసరం.

ఈ అంతస్థు వెనకభాగంలో మూడు చిన్నగదు లున్నాయి. వెనకటి మేనేజరు కుటుంబంతో సహా వీటిల్లోనే ఉండేవాడు.

ఈ భవంతిలో ప్రవేశించిన రెండు రోజుల తరవాత, మన 'అపూర్వ హంతకులు,' నలుగురు ఒకసారి ఇక్కడ సమావేశ మయ్యారు. బాగా చలి వేస్తోంది. దీనికి అడపా దడపా పడుతున్న వర్షపు జల్లులు కూడా తోడయ్యాయి. అయినా ఆ గదిలో మండే నెగళ్ళవల్ల చలీ అదీ లేకుండా చిరు వెచ్చగా, హాయిగా ఉంది.

ఆ గది అంతా చాలా పరిశుభ్రంగా ఉంది. మొత్తం కంపెనీకి సంబంధించిన మంచిమంచి కుర్చీలు బల్లలు, మొదలైన పరికరాలన్నీ ఇక్కడే అమర్చారు. నలుగురు ఒక పెద్ద బల్లచుట్టూరా కూర్చుని మాంచి పసందైన విందు భోజనం ఆరగించారు. కొన్ని కొన్ని తినుబండారాలింకా అక్కడక్కడ మిగిలిపోయాయి.

గోన్సాలెజ్ ఒక చిన్న పుస్తకం చదువుతున్నాడు. అది ఎర్రటి పుస్తకం. బంగారు కళ్ళజోడు పెట్టుకున్నాడు. పాయ్‌కార్ట్ ఒక మూలగా కూర్చుని ఏదో బొమ్మ గీస్తున్నాడు. మాన్‌ఫ్రెడ్ ఒక పొడుగాటి చుట్ట వెలిగించి ఫోటో తయారీకి సంబంధించిన వస్తువుల కేటలాగు జాగ్రత్తగా పరకాయిస్తున్నాడు. ఒక్క థేరీ మాత్రం ఏ పనీ చెయ్యకుండా నెగళ్ళలో బూడిదకేసి చూస్తూ బాగా దిగులుగా, పరధ్యానంగా ఉన్నట్టు కనబడ్డాడు. తన కలవాటయిన ధోరణిలో ఊరికే వేళ్ళటూ ఇటూ కదిలిస్తున్నాడు. అప్పుడప్పుడు నెగళ్ళలో మంటలకేసి చూస్తున్నాడు.

ఈ నలుగురు మధ్యన జరిగిన సంభాషణ అంతా అతరా బాదరాగా సాగుతూంది. అందరు తమతమ గొడవలే ఆలోచించుకుంటూ మొదలు తుద లేనట్టేవేవో ఇష్టం వచ్చినట్టు మాట్లాడుకుంటున్నారు. థేరీ ఒక్కడే తను చెప్పేదంతా సూటిగా చెప్పుకు పోతున్నాడు. పరధ్యానంగా నెగళ్ళలో మంటలకేసి చూస్తూన్న థేరీ తటాలున ఆ ముగ్గురికేసి తిరిగి—

"నన్నిక్కడ ఇంకా ఎంతకాలం అట్టేపెట్ట దలుచుకున్నారు?" అన్నాడు. పాయ్‌కార్ట్ బొమ్మ వెయ్యడం ఆపి, అతనికేసి చూసి—

"ఇది యీవిషయం అడగడానికిది మూడో సారి." అన్నాడు. థేరీ ఒక్కసారిగా, గొంతు స్థాయి హెచ్చించాడు: "ఆమాట్లాడే దేదో స్పానిష్ భాషలో మాట్లాడండి. నాకా ఇంగ్లీషు వింటూంటే అరికాలమంట నెత్తికెక్కుతూంది. ఈ భాష ఘోష నాకేమీ బోధ పడటం లేదు. ఇక మీ వ్యవహారం చూచినా అదీ సరిగా అలాగే ఉంది"

మాన్‌ఫ్రెడ్ స్పెయిన్‌దేశం దక్షిణాది వ్యావహారిక భాషలో మాట్లాడుతూ—"ఈ పని అంతా తెమిలేదాకా నువ్వు కొంచెం

ఓపికపట్టాలి. ఆ విషయం నీ కింతకుముందే చెప్పాము" అన్నాడు.

థేరీ విసుక్కుంటూ మళ్లీ సెగళ్లలో మంటలకేసి మొహం తిప్పేసుకుని దురుసుగా ఇలా గన్నాడు:

"ఏమిటో! ఇదంతా నాకు చాలా విసుగ్గా ఉంది. వెనకాల ఎవళ్ళూ వెంటాడించకుండా హాయిగా నేనొక్కణ్ణే షికారు వెళ్ళాలని అనుకుంటున్నాను. అసలు నా కింటికే పోవాలని ఉంది! అక్కడ ఎంత స్వంతంత్రంగా బతికేవాణ్ణి! ఏమయితేనేం! ఇక్కడికి రావడమే ఒక పెద్ద పొరబాటు! ఇప్పుడింక ఏమనుకుంటే మాత్రం ఏం లాభం!"

మాన్‌ఫ్రెడ్ ఆ మాటల కేమీ లొంగకుండా—"నాకూ కొంచెం కించగానే ఉంది. అయితే అంత పెద్దగా మధనపడవలిసిన దేమీ లేనే లేదు. ఇంక నీవ్యవహారంలో కూడా ఇబ్బంది ఏమీ ఉండదనే అనుకుంటున్నాను" అన్నాడు. థేరీ ఒక్క క్షణం ఏమీ అనకుండా మాట్లాడ కూరుకుని, ఇలా విరుచుకుపడ్డాడు:

"కాకపోయినా ఏమిటీ వ్యవహారం అంతా! ఈ హత్య చెయ్యడం ఎందుకు? ఇదంతా ఎవరికోసం? మీరంతా అరాజకవాదులా? దీనివల్ల మీకు వచ్చే లబ్ధి ఎంత? ఇదంతా ఇప్పుడే తేలిపోవాలి!" ఈ కొత్త మనిషి వేసిన ప్రశ్నపరంపరకు మిగిలిన ముగ్గురు ఏమీ చలించలేదు. గోన్సాలెజ్ నీలికళ్లు కొంచెం కుంచించి మెల్లిగా కన్నుగీటాడు. వెంటనే అతని ముఖంమీద సన్నని చిరునవ్వులు పరుగులెత్తాయి. తరవాత థేరీ ముఖంకేసి పరిశీలనగా చూస్తూ—

"చక్కని చిన్న కుదురు! ఇక ముక్కు చూస్తే కోసేశేసినట్టే ఉంది! మొహం అంతా సరిగా ఉలితో మలిచినట్లే ఉందే! బాగుంది! మహా బాగుంది!" అని పూర్వకవి ఎవరో చేసిన ముఖవర్ణన అంతా ఏకరువు పెట్టడం మొదలెట్టాడు.



ఇక థేరీ ఉండబట్టలేక, తటాలున లేచి నుంచుని తన మనస్సులో బిగబట్టుకునదంతా మెల్లిగా పైకి వెళ్ళగక్కాడు:

"అసలు వ్యవహారం అనుపాను లేమిటో నాకేమీ తెలియడంలేదు! మీ రిందులో డబ్బు గడించడం లేదనడానికి దాఖలా ఏమిటి? నన్ను పేపర్లుకూడా చదవనివ్వడం లేదే! ఒక్కణ్ణే వీథుల్లో తిరగనివ్వడం లేదు! కొత్త భాష తెలిసిన వాళ్లేవళ్లతోటి మాట్లాడడానికి వీలు లేదంటున్నారు. నన్ను పట్టి ఖైదీకింద జమకట్టేశారు! నిజానికి మీరు ముగ్గురు స్పెయిన్ దేశస్థుల్లా కనబడనే లేదు! ఆ భాష మాట్లాడినా, మీరు స్పెయిన్ దేశస్థులు కారని నా నమ్మకం! మీరందరు నన్ను చంపెయ్యాలని నిశ్చయించారు. అదెలాగో మాత్రం నాకు తెలియానివ్వడంలేదు!—"

మాన్‌ఫ్రెడ్ చటుక్కున లేచి నుంచుని థేరీ బుజంమీద చెయ్యివేసి సమాధానం చెప్పాడు. చెబుతూన్నంతసేపు అతని కళ్ళల్లో దయాదాక్షిణ్యాలు తాండవిస్తూనే ఉన్నాయి. మాన్‌ఫ్రెడ్ ఇలా అన్నాడు:

"ఇదిగో థేరీ! నువ్వు కొంచెం తమాయించాలి. నా మాట విను! మేము డబ్బు కక్కుర్తికోసం హత్యలుచేసే రకం గాదు! ఇది ముమ్మాటికీ నిజం! నీ పక్కని కూర్చున్నవాళ్ళిద్దరు ఎలాంటివాళ్లో నువ్వెరగవేమో! చెబుతాను విను! ఈ ఇద్దరికీ ఒక్కొక్కళ్లకి అరవైలక్షల దాకా ఆదాయం వస్తుంది. నా ఆదాయం అంతకన్నా ఎక్కువ! మేమంతా ప్రభుత్వం జరిపే దురన్యాయాల మూలంగా చాలా బాధలు పడ్డాం. హైకోర్టులదాకా వెళ్లినా చివరికి మా కన్యాయమే జరిగింది. కనకనే మేమీ హత్యలు మొదలెట్టాం. అయితే-అయితే-" అని అల్లాగే థేరీవైపు కొంచెంసేపు తీవ్రంగా చూశాడు. తరవాత ఆ తీవ్రత కొంచెం తగ్గించి ఇల్లాగన్నాడు:—

"ఒకవేళ మాకు నిన్ను చంపవలసిన అవసరం వస్తే - మేము చేసే మొట్టమొదటి హత్య అదేనన్న మాట!"

థేరీ గోడకానుకొని అలాగే నిలబడి ఉన్నాడు. మొహం అంతా కళాయి వేసినట్లైపోయింది. దెబ్బతిన్న పులిలాగ రొజుకుంటూ అక్కడ కూర్చున్న అందరికేసీ బాగా అనుమానంగా చూస్తూ అడిగాడు:

"నన్నా? చంపేస్తారా! ఎందుకు?

మిగిలినవాళ్లంతా కిమన్నాస్తి. మాన్‌ఫ్రెడ్ అతని భుజంమీదవేసిన చెయ్యి తీసివేసి—

"అవును నిన్నే! నీలాంటివాణ్ని చంప

మావయ్య: ఎందుకురా ఏడుస్తున్నావు? తప్పమ్మ. అలా ఏడవకూడదు.

మేనల్లుడు: నాకిలాగే వచ్చు. ఇంకోలా ఏడవలేను.

డానికికే మొదలన్నమాట! న్యాయంకోసం తప్ప - మే మెప్పుడు - ఎవర్నీ చంపలేదు! నిన్ను చంపడం అంటే - అది చాలా అన్యాయమే!" అన్నాడు.

పాయ్‌కార్ట్ థేరీకేసి జాలిగా చూస్తూ - "మేము ప్రత్యేకంగా నిన్నే ఎన్నుకోవడానికి కారణం ఇదే! ఈ వ్యవహారంలో ఎప్పుడూ ఏదో మోసం జరుగుతూనే ఉంటుంది. అందుచేత ఇంతా చేస్తే నువ్వే నయమని అనుకున్నాము" అన్నాడు.

మాన్‌ఫ్రెడ్ మళ్ళీ అందుకున్నాడు:

"నేనొకమాట చెబుతున్నాను. జాగ్రత్తగా జ్ఞాపకం పెట్టుకో! నువ్వు మాతో కలిసిమెలిసి తిరిగి బాగానమ్మకంగా ఉన్నావంటే — నీకేమీ పరవాలేదు! పైగా నీకొక పెద్ద బహుమతికూడా ముడుతుంది. దానితో నువ్వు బతికిఉన్నంతకాలం హాయిగా కాలుమీదకాలు వేసుకుని కూర్చోవచ్చును. పైగా నువ్వు కన్నువేసిన చిన్నదికూడా నీకు దక్కుతుంది. తెలిసిందా!"

థేరీ ఇదంతా విని "ఆఁ ఇదంతా జరిగినచచ్చింది!" అన్నట్టు చూస్తూ, కూర్చున్నాడు. అగ్గిపుల్లగీసి సిగరెట్టు వెలిగిస్తూంటే అతని వేళ్ళింకా వణుకుతూనే ఉన్నాయి. మాన్‌ఫ్రెడ్ తన 'మాట' ఇంకా అలాగే చెబుతూనే ఉన్నాడు:

"ఈవేళనించీ నీకింకా ఎక్కువ స్వాతంత్ర్యం ఇస్తున్నాం. రోజూ నువ్వింక షికారుకు వెళ్ళివచ్చును. త్వరలోనే మనమంతా మళ్ళీ స్పెయిన్ వెళ్ళిపోతున్నాం. ఖైదులో ఉన్నప్పుడు నిన్నంతా చాలా నెమ్మదైనవాడని అంటూండేవారు. ఇకముందుకూడా మువ్వామాట నిలబెట్టుకుంటావని నా ఆశ."

తరవాత మిగిలినముగ్గురు ఇంగ్లీషుభాషలో సంభాషణ మొదలెట్టారు. అందుచేత థేరీకి వాళ్ళు మాట్లాడుకునేది — అక్షరం కూడా బోధపడలేదు! వారిలో గోన్సాలెజ్ ఇలాగన్నాడు:

ఇప్పుడితనికి ఇంగ్లీషువాళ్ళ వేషం వేశాం. కనక ఎవళ్ళూ ఇతన్ని అనుమానించరు. మనకింక థేరీవిషయంలో చిక్కేమీ ఉండదు.

అయితే ఇతనికి రోజూ రోజూ గడ్డంగీసుకోవడమంటే కిట్టదు. కాని ఇది చాలాఅవసరం. అదృష్టవశాత్తు మనిషి కొంచెం ఎర్రగా బుర్రగా ఉంటాడు. ఇది చాలా బాగా ఉపయోగించింది... నేనితన్ని వీధుల్లో పైవాళ్ళతోను మాట్లాడనివ్వడంలేదు. కనకనే మాటిమాటికీ కస్సుబుస్సుమంటున్నాడు."

మాన్‌ఫ్రెడ్ సంభాషణ ఇంకా తీవ్రమైన విషయంలోకి తిప్పివేస్తూ ఇలా చెప్పాడు. "ఇంకా రెండు బెదిరింపు ఉత్తరాలు పంపిస్తున్నాను. అందులో ఒకటి సరీగా హుజూరుకే చేరిపోవాలి. మంత్రి చాలా గుండెనిబ్బరంఉన్న మనిషిలా కనబడుతున్నాడు."

"అయితే మన గార్సియా మాటేమిటి?"

మాన్‌ఫ్రెడ్ ఒక్కసారి పకపకా నవ్వాడు:

"మొన్న ఆదివారంనాడు రాత్రి నాకొక హాల్లో కనిపించాడు. మానవస్వాతంత్ర్యమీద ప్రబ్రహ్మాండంగా ఉపన్యాసం ఇస్తున్నాడు. పాపం చాలా పెద్దవాడైపోయాడు! కాని ఏమి వాగ్ధోరణి! ఏదో పెద్ద ఫ్రెంచి విప్లవకారుడులా ఉద్బోధిస్తున్నాడు! నేనా హాల్లో ఒకవెనక బెంచీమీద కూర్చుని ఆయన ఉపన్యాసం అంతా వింటున్నాను. వచ్చినవాళ్ళలో చాలామంది లండన్ నగరం తూర్పు పేటల్లో జనమే! వాళ్ళంతా అరాజకవాదానికి ఆత్మార్పణం చేసేస్తున్నామని కోతలుకొయ్యడానికే అక్కడ గుమిగూడినట్టున్నారు."

పాయ్‌కార్ట్ విసుగ్గావేళ్ళతో బల్లమీద తాటిస్తూ — "అయితేమాన్‌ఫ్రెడ్! చివరికిమాటింగులన్నీ వట్టి వేళాకోళం వ్యవహారంలా తయారవుతున్నాయే!" అన్నాడు.

మాన్‌ఫ్రెడ్ ఒక్కనవ్వునవ్వి చెప్పాడు: "ఈ వ్యవహారాలు చివరికి ఇల్లాగ నవ్వులాటల్లాగే తయారౌతాయిలే! పాపం గార్సియా స్పెయిన్‌దేశం భవిష్యత్తంతా తన గుప్పిట్లో పెట్టుకున్నట్టే మాట్లాడతాడుగాని చివరికిది అంతా పాపుల్లో పనిచేసే అమ్మాయిలకి కూడా వట్టి వేళాకోళంగా తయారయింది!"

ఈ సంభాషణ ఇలాగ సాగిపోతూన్నంతసేపూ థేరీ గుప్పుగుప్పున పొగ వదులుతూనే ఉన్నాడు. చేతిమీద తల ఆనించి, అప్పుడప్పుడు నాగళ్ళలో మంటలకేసి చూస్తున్నాడు.

"అయితే ఈ వ్యవహారం కొంచెం జాగ్రత్తగా ఆలోచిద్దాము. మనం నిశ్చయించుకొన్న ఆఖరిరోజుదాకా ఇక చెయ్యవలసిన పని ఏమీ లేదన్నమాటేనా?" అని అడిగాడు గోన్సాలెజ్.

"ఏమీ లేదు!"

"ఆ తరవాత?"

"ఆ తరవాత మళ్ళీ ప్లాను తయారీ ఉందిగా!"

"ఆ తరవాత?" అని మళ్ళీ అడిగాడు పాయ్‌కార్ట్.

"హాలండ్‌లో చక్కబెట్టవలసిన వ్యవహారం ఇంకొకటి ఉంది. కాని అది చాలా చిన్నపని. హెచ్చరికలు, గిచ్చరికలు ఏమీ అక్కరలేదు."

పాయ్‌కార్ట్ గంభీరగాముఖంపెట్టి సమాధానం చెప్పాడు:

"ఆఁ! అన్నట్టు సమయానికి జ్ఞాపకం చేశావు! ఆ హాలండుదేశంల్లో పని ఇంతకుపూర్వమే అయిపోవలిసింది! అయితే అక్కడ ముందుగా ఎవరిపని పట్టించాలి?"

"కొంచెం వ్యవధిఉంటే ముందుగా మనం అనుకున్న అతగాడి అంతే చూడవచ్చును."

"మరి థేరీమాట!"

గోన్సాలెజ్ యాదాలాభంగా "ఆసంగతి నేను చూస్తానులే!" అని నవ్వుతూ, "మనం ఆ అమ్మాయి ఉన్నచోటికి వెడుతున్నాంగా!" అన్నాడు.

ఈలోగా థేరీ పదో సిగరెట్టుకూడా ఊదేసి గట్టిగా విసుక్కుంటూ కుర్చీమీద చతికిలబడ్డాడు.

ఇంతలో గోన్సాలెజ్ ఇంకొక సంగతి చెప్పాడు:

"అన్నట్టు ఇందాకటినించీ మీతో చెప్పడం మరిచిపోయాను. ఈమధ్య థేరీ నేను కలిసి షికారు వెడుతూంటే ఒక చిన్న చిత్రం జరిగింది.

దోవలో గోడలమీద అంటించిన ప్రకటనదగ్గర జనం గుంపులుగుంపులుగా గుమిగూడారు. అంతమంది వాటిదగ్గర జేరడం

# ★ అపూర్వ హంతకులు ★

చూస్తే అతనికి చాలా ఆశ్చర్యం వేసింది. నేనా సమయంలో ఒక పెద్ద అబద్ధం ఆడేశాను. కాని నాకబద్ధాలాడడం అంటే చాలా అసహ్యం!"

ఇది గొన్సాలెజ్ చాలా నిజాయితీతో చెప్పినమాట! గొన్సాలెజ్ అలాగే చెబుతూ — "అయినా ఏం చెయ్యను! ఒక చిన్న కోత కోశాను! అవి సుజ్జిప్పందాలకో, లాటరీలకో సంబంధించినవని దబాయించాను! పాపం ఫేరీ నిజమేనని నమ్మాడు!"

ఫేరీ ఈ ఆంగ్లసంభాషణలో తనపేరు దొర్లిందని గ్రహించుకుని 'అదేమై ఉంటుందా?' అన్నట్టుగా వాళ్ల ముగ్గురికేసీ చూశాడు.

"పాయ్‌కార్టు నేనూ కలిసి కొన్ని చిన్న పరిశోధనలు చెయ్యాలి. మేమిద్దరము వెళ్లిపోతున్నాం. నీకు తోడుగా గోన్సాలెజ్ ఉంటాడులే" అని చెప్పి మాన్‌ఫ్రెడ్, పాయ్‌కార్టులిద్దరు అక్కడినించి వెళ్ళిపోయారు! తరవాత వారిద్దరు ఒక ఇరుకుదారమ్మటే కొంత దూరంవెళ్లి ఒక గుమ్మందగ్గిర ఆగిపోయారు. దానికి పక్కగా బీగం వేసి బిగించిన ఇంకో గుమ్మం ఉంది. అదే స్టుడియో. జేబులోనించి ఒక తాళంచెవితీసి మాన్‌ఫ్రెడ్ మెల్లిగా తలుపు తెరిచాడు. లోపలికివెళ్లి స్విచ్చినొక్కాడు. బూజుపట్టిన ఎలక్ట్రిక్ దీపం కొంచెం గుడ్డిగా వెలిగింది. గది అంతా కొంత గందరగోళంగానే ఉంది గాని, కొన్ని సామానులు జాగ్రత్తగాఅమిర్చినట్లున్నాయి. రెండు మూడు అలమారులు తుక్కు, దూగరా ఏమీ లేకుండా శుభ్రం చేశారు. వాటిల్లో తళతళలాడే చిన్నచిన్న సీసాల వరసలు మెరుస్తున్నాయి. ప్రతి సీసామీద ప్రత్యేకంగా నెంబర్లు వేశారు. ఆ సీసాల దగ్గిరగా ఒకబల్ల; దానిమీద వేసిన పలచని ఆకుపచ్చ తివాసీమీద అతి సున్నితమైన త్రాసులు, టెస్టుట్యూబులు మొదలైన పరిశోధన సామగ్రి. వాటి పక్కగా చిత్రమైన రెండు గాజుయంత్రాలు.

పాయ్‌కార్ట్ ఒక కుర్చీ ఆ బల్లకుదగ్గిరసా లాక్కున్నాడు. ఎదురుగా ఉన్న నీటితొట్టిలోనించి బహుజాగ్రత్తగా ఒక చిన్న గిన్నె పైకితీశాడు. మాన్‌ఫ్రెడ్ పాయ్‌కార్ట్ వెనకాల నిలుచుని పరిశీలనగా ఆ గిన్నెకేసి చూస్తూ 'రైట్!' అన్నాడు. పాయ్‌కార్ట్ తలవంచి, మరీ పరిశీలనగా ఆ గిన్నెలో ఉన్న పదార్థంచూసి, మాన్‌ఫ్రెడ్ అన్న మాటకు, గిన్నెలో కనబడిన దానికీ లోలోపల ఎంతో మురిసిపోతూ అన్నాడు:

"అవును! సరిగా పాళ్లన్నీ మనం అనుకున్నట్టుగానే సరిపోయాయి. ఎప్పుడో ఒకప్పుడిని ఉపయోగించేఅదను రాకపోదు."

తరవాత పాయ్‌కార్ట్ ఆగిన్నె భద్రంగా ఆ నీటి తొట్టిలో పెట్టాడు. బల్లకిందనించి కొంచెం మంచుముక్క పాడితీసి ఆగిన్నె చుట్టూరా చల్లుతూ "దీన్ని మించిన చిన్న పేలుడు వస్తువేది ఇక ప్రపంచంలో ఉండబోదు" అన్నాడు.

వెంటనే అలమారులోనించి ఒక చిన్న సీసా పైకితీసి, చిటికెనవేలితో బిరడా పక్కకి ఒత్తిగించి, తెల్లని రసాయనద్రవ్యం బిందువులా గిన్నెలో చిలకుతూ—ఇలా అన్నాడు:

"దీనితో మిగిలిన రసాయన పదార్థాలన్నిటికీ పాళ్లు బాగా సరిపోతాయి" అని పెద్ద నిట్టూర్పు విడిచిపెట్టాడు.

తరవాత "నేను అయినదానికీ, కానిదానికీ కంగారుపడే ఘటాన్నిగాదు. కాని గత రెండురోజులనించీ ఎంత ప్రయత్నించినా ఒకచిన్న కునుకుకూడా పట్టలేదు!" అన్నాడు.

మాన్‌ఫ్రెడ్ జేబురుమాలు ముక్కుదగ్గిర పెట్టుకుని "అబ్బా! ఏమి వాసన!" అన్నాడు.

ఆ గిన్నెలోనించి సన్నగాపొగ బయలుదేరింది.

పాయ్‌కార్ట్ గిన్నెలో ఒక గాజు చువ్వ పెట్టి, మెల్లిగా అది పైకెత్తి "నే నలాంటివన్నీ లక్ష్యపెడతానా!" అన్నాడు.

తరవాత ఆచువ్వ పైకెత్తాడు. దానిచివర భాగంనించి నాలుగైదు ఎర్రని చుక్కలు రాలాయి.

"ఇదిగో! సరిగాఅనుకున్నట్టేవచ్చింది!" అన్నాడు.

"అయితే ఇంక దీనిని పేలుడువస్తువనడానికి వీల్లేదన్నమాట!" అన్నాడుమాన్‌ఫ్రెడ్.

"కప్పుకాఫీ ఎలాంటిదో ఇదీ అలాంటిదే!"

పాయ్‌కార్ట్ ఆచువ్వ గుడ్డతో శుభ్రంగా తుడిచి, ఆ చిన్నసీసా మళ్ళీ అలమారులో పెట్టి, మాన్‌ఫ్రెడ్‌కేసి తిరిగి "మరి ఈ తరవాత?" అన్నాడు.

మాన్‌ఫ్రెడ్ ఏమీ జవాబు చెప్పలేదు. తరవాత పక్కనేఉన్న ఒక పాత ఇనప పెట్టెతీసి, దానిలోనించి చక్కగా చిత్రిక పట్టిన ఒక కర్రపెట్టె తీసి మాన్‌ఫ్రెడ్‌కు చూపించి, "ఫేరీ చాలా మంచిపనివాణ్ణని అంటున్నాడు. అదే నిజమయితే సర్ ఫిలిప్ రేమన్ ప్రాణాలు తియ్యడానికిది చక్కని ఎర" అన్నాడు.

పాయ్‌కార్ట్ పెట్టెలో ఉన్న ఆ వింత వస్తువుకేసి చూస్తూ — "చాలా విచిత్రంగా ఉందే!" అన్నాడు. తరవాత "ఫేరీకి తన మూలంగా బయలుదేరిన గందరగోళంసంగతి తెలుసునా?" అని అడిగాడు.

మాన్‌ఫ్రెడ్ ఆ కర్రపెట్టె మూతవేసి, మళ్లీ అది జాగ్రత్తగా ఆ ఇనప పెట్టెలో పెట్టి ఇలాగన్నాడు:

"ఫేరీకి తను నాలుగో న్యాయ సంరక్షకుడనన్నమాటమాత్రం తెలుసునా?"

మళ్ళీ మెల్లిగా "బహుశః అతనికా విషయం తెలియదనుకుంటాను — వెయ్యి పౌనులంటే స్పెయిన్‌లో 3 వేలన్నమాట! తరవాత క్షమాపణకూడాఉన్నదిగా! ఇంకా ఆపైన అతగాడు కన్నేసిన ఆఅమ్మాయికూడాఉంది!" అన్నాడు కొంచెంలోతుగా ఆలోచిస్తూ.

* * *

రిపోర్టర్ బుర్రలో ఒక జాజ్వల్యమైన ఆలోచన మొలకెత్తింది! వెంటనే అది ఎడిటర్జీ కందజేశాడు. ఆయన రిపోర్టర్‌కేసి ఎగాదిగా చూసి "భయంలేదు! బాగానే ఉంది!" అన్నాడు. అంటే అది జాజ్వల్యమానంగా ఉన్నదన్నమాట!

"ఈ నలుగురులోను ఇద్దరు విదేశీయులనీ, వాళ్లకి ఇంగ్లీషు అక్షరం ముక్కకూడా తెలియదనీ నా నమ్మకం!"

ఎడిటర్జీ ఈమాటపై "నాకూ అలాగే అనిపిస్తోంది. మహామంచిసలహా ఇచ్చావు. ఈ వేళ రాత్రే అది వెళ్లిపోతుంది" అన్నాడు.

మర్నాడు బాకాపత్రిక పోలీసుల ప్రకటన ఫ్రెంచి, ఇటాలియన్, జర్మన్, స్పానిష్ భాషలలోకూడా ప్రకటించివేసింది.

రిపోర్టర్ బుర్రలో మొలకెత్తిన ఆలోచనాంకురం చివరికి విశ్వంగా చీలవలు, పలవలు వేసి నాలుగు మూలలా అలుముకుపోయింది!

—ఇంకా ఉంది

★

# లేడీస్ క్లబ్

వెంపటి సచ్చిదానంద శర్మ

మావూరి లేడీస్ క్లబ్బు సెక్రటరీ పదవి కలెక్టరుగారి భార్య తన కక్కర లేదంటేతప్ప ఇతరు లెవ్వరినిగురించీ ఆలోచించకపోవడం స్థానిక మహిళలు అనాదిసిద్ధంగా పాటిస్తున్న ఆచారం.

ఈ సారి మాకు కలెక్టరుగా వచ్చిన రాజశేఖరరావు గారు అసాధారణ వ్యక్తి.

—అంటే ఏమీ లేదు చాలా చిన్న వయసువాడు. కాలేజీచదువు ముగించి, 'ఐ. ఏ. ఎస్.' పరీక్షకు కూర్చుని, ప్రొబేషన్ పూర్తిచేసి ఇట్టే కలెక్టరుఅయి కూర్చున్న వ్యక్తి.

చదువుకునే రోజుల్లో—కాలేజీ అమ్మాయిల్ని, లెక్చరర్లవంటి అర్భకుల్ని "ఏడిపించిన ఏడిపింపులు," సమ్మెలు వగైరాలలో చేసిన హంగామా ఏమీ మరిచిపోయే సావకాశం లేకుండానే "శాంతి, భద్రతలు" కాపాడవలసిన జిల్లా అధికారి అయిన మనిషి.

ఇందువల్లనే అయ్యుండవచ్చు—ఛోటా ఆఫీసర్లు తమ కిందివాళ్ళపైన ఏవైనా ఫిర్యాదులు చేస్తే, కలెక్టరుగారితీర్పు ఏ పక్షానికి అనుకూలంగానో తెలియనంత మెత్తగా మందలిస్తాడని ప్రతీతి. ఇందుకనే ఛోటా ఆఫీసర్లంతా వీలైనప్పుడల్లా ఒకమూల చేరి—కలెక్టరుగారికి కుర్రతనంవల్ల వ్యవహారజ్ఞానం కొరవడిందనీ, కేవలం డిగ్రీలు చూచి అందలం ఎక్కించడం పేమను పెత్తనం ఇవ్వడమనీ తీర్మానించి, పాతకాలపు కలెక్టర్లు అందర్నీ ఎంత గడగడ లాడించేవారో నెమరవేసు కుంటూ వుంటారు.

—ఇలాటి కలెక్టరు గారికి తగ్గదే ఆయన భార్య శ్రీమతి రాజశేఖర మనోరమ కూడాను. పది మందిలో ఒకతెగా కలిసి మెలిసే క్షణం తీరిక లేకుండా మసలండే అసలు ఆవిడకు ఏమీ తోచదేమోనని క్లబ్బు మహిళలందరి అనుమానం. ఈ విధంగా ఆమె లేడీస్ క్లబ్బు సెక్రటరీ పదవికి అన్నిందాలా అర్హురాలయింది.

కలెక్టరుగారి సతీమణికూడా పెద్దచదువు చదివిందని తెలిసేసరికి వీరిది "ప్రేమ పెళ్ళి" అయివుంటుందని క్లబ్బులో అమ్మలక్కలు చాలామంది నిర్ణయించారు.

అయితే ఈ విషయాన్ని ఔనననేవారు, కాదనేవారుకూడా లేకపోలేదు.

కాని, వీరిద్దరికి "ప్రేమ పెళ్ళి" అయివుంటేనే బాగుంటుందనిమాత్రం క్లబ్బు మెంబర్ల ఏకగ్రీవాభిప్రాయం.

ఈక్లబ్బు మెంబర్లకు క్లబ్బు వార్షికోత్సవం ఒక పెద్దవేడుక. ముఖ్యంగా వాళ్లు వంచనీకుండా ఇళ్లదగ్గర పనిమనుషు లున్న పడుచులు, సదవకాశం దొరికిందన్నట్లు ఇక్కడ యిలాటి సందర్భాలలో వాళ్లు వంచుతారు. గోడలకు సున్నాలు కొట్టించడం, తలుపులకు, దర్వాజాలకు రంగులు వేయించడం, రంగు కాగితాలతో రకరకాల బుట్టలు కట్టడం - ఇత్యాది అలంకరణాలపట్ల స్త్రీలకు సహజంగా ఉండే శ్రద్ధనంతా అక్కడ ద్యోతకంచేస్తారు.

క్లబ్బుభవనం సువిశాలమైనది. మధ్య పెద్ద హాలు, ఇటూ అటూ మూడేసివంతున గదు లున్న పెద్దడాబా. ముందు, వెనక వరండా లున్నాయి మధ్యహాలులో కూర్చుని పత్రికలు వగైరాలు చదువుకోడానికి ఏర్పాట్లు ఉన్నాయి. క్లబ్బులో కుడివైపు మొట్ట మొదటి గదిలో సెక్రటరీగారి ఆఫీసు ఉంది దాని వెనకగదిలో లైబ్రరీ ఉంది. ఎడమ వైపున మొట్టమొదటి గదిలో ఆటల సామానులు వగైరా దాచివుంచుతారు. దానివెనక గదిలో పింగ్-పాంగ్ టేబులు ఉంది ఆ వెనకది క్లోక్ రూమ్. వెనక వరండాలో రోజూ సాయంత్రంపూట మెంబర్లుకేరమ్సూ వగైరా ఆడుతుంటూ వుంటారు. భవనానికి వెనకదొడ్లో టెన్నిస్ కోర్టు, బేడ్మింటన్ కోర్టు, రింగ్ టెన్నిస్ కోర్టు ఉన్నాయి. భవనానికి చుట్టూ గోడవుంది

ఇన్ని హంగులున్న క్లబ్బు నిజానికి పెద్దదనే చెప్పాలి. మరి, మావూరి మహిళలదికూ అటువంటిదే.

ఈసారి క్లబ్బు వార్షికోత్సవానికి మెంబర్లంతా మరింత ఉత్సాహంగా పూనుకున్నారు. క్లబ్బు భవనాన్నంతా పెళ్లివారిల్లులాగా అలంకరించారు, ఇల్లాళ్ళందరూ చేరి వెనక దొడ్లో అంతా పెద్దపందిరి వేయించి, రకరకాలుగా అలంకరించారు. చక్కని స్టేజి ఏర్పాటుచేశారు.

అయితే, ఈ నాటి కార్యక్రమం — జిల్లా జడ్జీగారమ్మాయి నాట్యం, జిల్లా డాక్టరు గారమ్మాయి పాటకచ్చేరి, గవర్నమెంటు ప్లీడరు గారమ్మాయి వగైరాల నాటకము - ఇత్యాదుల్లో కలెక్టరు గారిచ్చిన అధ్యక్షోపన్యాసమే మనకు ముఖ్యం.

ఇలాటి మహిళాసభలో మాట్లాడే మహాదౌర్భాగ్యం ఏపురుషుడికైనా అసలు పట్టాలే గాని, విజృంభించి వెళ్ళాక్కోడానికి దిగకుండా వుండడు బుద్ధిపుట్టదు. అందులోనూ కలెక్టరు గారు యువకుడు, విద్యాధికుడుకూడా నేమో - మరింత బాగా రాణించాడు!

ఈసమయంలో ప్రత్యేకతకూడావుంది - ఇది కేవలం క్లబ్బు వార్షికోత్సవమే గాక, క్లబ్బులో "న్యూయింగ్ స్కూల్" ప్రారం

—అలా చూపట్టు మేరనంతా పరికించడంలో, అల్లంత దూరాన మేడమీది ఒకభాగంలో కాపరం వుంటున్న కలెక్టరాఫీసు గుమాస్తా కృష్ణమూర్తిమీద, అతడిభార్య దుర్గమీద మనోరమ చూపులుపడి నిలిచిపోయినై.

# ★ లేడీస్ క్లబ్ ★

భోత్సవసమయం కూడాను. ఈ స్కూలు ఏర్పాటుయొక్క పూర్వగాథ అంతా తన కళ్ళముందే జరిగివుండడంవల్ల, ఇటువంటి సమయంలో అధ్యక్షస్థానాన్ని అలంకరించడానికి తనకంటె అర్హు డెవ్వరూ వుండరనే ధీమాతో కలెక్టరుగారు ఇందుకు అంగీకరించారు:

దీనికి తగ్గట్టుగానే -

"స్త్రీలనుగురించి నాకు దాదాపు ఏమీ తెలియదు. ఏమీ తెలియనివాణ్ణి వేదిక ఎక్కిస్తే ఎలా కంగారుపడతాడో చూదామని, మీ వినోద కార్యక్రమాల్లో ఒకటిగా నా అధ్యక్షోపన్యాసాన్ని ఏర్పాటు చేశారనుకుంటాను!" అంటూ కలెక్టరుగారు తన ఉపన్యాసాన్ని ఇలా సాగించారు: "తల్లిగా స్త్రీనిగురించి నాకు ఏమైనా తెలుసునని నేను అనుకున్నప్పటికీ ఆ విషయాన్ని మా అమ్మ ఎంతమాత్రం ఒప్పుకోదు. నేనేమీ అభమూ శుభమూ ఎరగనివాణ్ణనే ఆవిడ నిశ్చితాభిప్రాయం. సోదరిగా స్త్రీనిగురించి నాకు తెలుసునని పొరపాటుగానైనా అన్నానంటే, నా అప్పచెల్లెళ్ళలో ఒక్కరు కూడా సహించరు. 'నా సంగతి నీకేం తెలుసు' - అన్న మాటలు వాళ్ళ నోటివెంట ఎన్నిసార్లు విన్నానో! కుమార్తెగా స్త్రీనిగురించి తెలుసుననే నమ్మకం నాకు ఎప్పుడూ లేదు. మా అమ్మాయి వేస్తూవుండే చిక్కుప్రశ్నలకు నేనుచెప్పే సమాధానాలు సరైనవికావని నాకు పూర్తిగా తెలుసు. మా అమ్మాయి ప్రశ్నలే అర్థంకానివాణ్ణి, ఇంక దాన్నిగురించి నాకు తెలుసునని ఎలా అనుకోను? ఇక పోతే భార్య ఒకతె మిగిలివుంది - ఇదే ముఖ్యవిషయం! భార్యగానైనా స్త్రీనిగురించి కూలంకషంగా నాకు తెలుసునని ఇటీవలివరకు గర్విస్తూ వుండేవాణ్ణి. అయితే, ఈ గర్వభంగం ఎలా జరిగిందీ చెప్పతగ్గసమయం ఇంతకంటె మరొకటి వుండదు. ఈ విషయాన్ని మీరుకూడా గ్రహిస్తారు..."



కలెక్టరుగారు తన ప్రసంగాన్ని ఒక్కక్షణంపాటు ఆపుచేసేసరికి సభ్యురాం డ్రంతా గుసగుసలు ప్రారంభించారు.

"మీకు ఏదో హితోపదేశం చేయాలనే ఉద్దేశంతో నేను ఇక్కడికి రాలేదు. నాకు ఎవరైనా—ఇలా చెయ్యి, అలా చెయ్యి; ఇది మంచిది, అది మంచిది—అని చెప్పవస్తే చాలా చిరాకు వేస్తుంది. నేను చెయ్యవలసిందేదో నన్నే ఎందుకు తెలుసుకోనియ్యవు? నీ పెత్తనం ఏమిటి?—అని తిరగపడే బుద్ధి పుడుతుంది, అందువల్ల నేను ఆ పని చెయ్యను. 'ఉపన్యాసం' మాని జీవితానుభవం వెల్లడిస్తాను. ఇందులో ఒకవేళ ఏదైనా నీతి కనిపిస్తే అది జీవిత స్వభావసిద్ధమయింది తప్ప కృతకమయింది మాత్రం కాదని నమ్మండి!" అంటూ కలెక్టరుగారు ప్రారంభించారు—

సభ్యురాండ్రంతా చెవులు రిక్కించి కూచున్నారు—

అయితే, ఒక్క విషయం: కలెక్టరుగారు చెప్పిన ఉదంతాన్నే మరొక రూపంలో ఈ దిగువ విధంగా చెపితే రసవత్తరంగా వుంటుందనుకుంటాను. ఇందువల్ల కథాకథనం చెడిందనుకునే వాళ్లుంటే క్షమించాలి. వాళ్లయినా కాని, దీని అసలు రూపం ఎలా వుండి వుంటుందో తేలికగానే ఊహించుకోగలరనుకుంటాను.

—ఒక ఆదివారంనాటి సాయం సమయాన కలెక్టరుగారు, ఆయన సతీమణి మేడమీది బాల్కనీలో కూర్చుని వున్నారు. కూతురు కల్పన తండ్రి వొళ్ళో చేరి ఏవేవో పిచ్చి ప్రశ్నలు వేస్తోంది. చాలా వోపిగ్గా వాటన్నిటికీ సమాధానాలు చెప్పడానికి ఆయన ప్రయత్నిస్తున్నాడు.

"ఆ పక్షులెక్కడికి వెడుతున్నాయి? నాన్నా!" అంది కల్పన ఆకాశంలో ఎగిరిపోతున్న పక్షులకేసి వేలు చూపిస్తూ.

"వాళ్ళింటికమ్మా!" అన్నాడు కలెక్టరుగారు.

"అలా వెడతారేం? అత్తయ్యా వాళ్ళ వూరా వాటిది?"

"అవునమ్మా!"

"రాధాయి ఇప్పుడేం చేస్తూ వుంటాడు నాన్నా!"

"ఏముంది? ఇలాగే పక్షులకేసి చూస్తూ వుంటాడు!"

"నాన్నా నీకు పక్షులభాష వచ్చా?"

"రాదమ్మా!"

> గురువు: ఈ ద్రావకంలో ఈ పావలా వడేస్తాను. అది కరుగుతుందో కరగదో చెప్పాలి.
>
> శిష్యుడు: కరగదండి.
>
> గురువు: భేష్. ఎందుకు కరగదు?
>
> శిష్యుడు: కరిగేటట్లయితే మీ రసలు పావలా అందులో వెయ్యరుగా.

"రాధాయికి వచ్చుట నాన్నా!"

"ఎవరు చెప్పారమ్మా నీకు?"

"వాడే చెప్పాడు నాన్నా! తనకి బోలెడన్ని భాషలు వచ్చు. మాట్లాడాడు కూడాను!"

కూతురి అమాయకత్వానికి, మేనల్లుడి ప్రగల్భానికి కలెక్టరుగారు నవ్వుకుని మనోరమ వైపు చూశారు.

మనోరమ ఆ సంభాషణ నేమీ వినలేదు. ఏదో పరధ్యానంగా అటూ ఇటూ చూస్తోంది. అయితే, నిజానికి ఆమె ప్రత్యేకంగా దేనినీ చూడడం లేదనే చెప్పాలి.

—అలా చూస్తూ మేరనంతా పరికించడంలో, అల్లంత దూరాన మేడమీద ఒక భాగంలో కాపరం వుంటున్న కలెక్టర్ ఆఫీసు గుమాస్తా కృష్ణమూర్తి మీద, అతడి భార్య దుర్గమీద ఆమె చూపులు పడి నిలిచిపోయినై.

కృష్ణమూర్తి తనభార్యను యెందుకో తీవ్రంగా మందలిస్తున్నాడు. దుర్గ అమాయికంగా వలవలా ఏడుస్తూ మధ్య మధ్య పైట చెంగుతో కన్నీళ్లు తుడుచుకుంటోంది.

నిజానికి వాళ్ళిద్దరిమధ్య అంత కొంప ముంచుకుపోయే సమస్య లేవీ ఉండడానికి వీలు లేదనిపిస్తుంది, వాళ్ళిద్దరినీ చూచేవాళ్లకి. అయినా ఏవో సమస్యలతో సతమత మౌతున్నట్లు ఆ యువదంపతులు పడుతూన్న కలవరపాటు చూచేసరికి - మనోరమ, కూడదనుకుంటూనే "సెంటిమెంటల్"గా తయారయింది.

కలెక్టరుగారు ఉపయోగించినమాటే ఇది! మనోరమ విషయంలో ఆయన యీ మాట ఉపయోగిస్తూవుండడం, అందుకు ఆవిడకు కోపం రావడం తరుచు జరుగుతూనే ఉంటుంది. ఈమాట అంటే తనని యేదో తిట్టినంతగా బాధపడుతుంది మనోరమ.

ఏమీ చేయలేక అంగలార్చే వారిని "సెంటిమెంటల్" అంటారని ఆమె భావన. తను అంత అశక్తురాలు కాదనీ, గుండెనిబ్బరం కలదాన్ననీ ఆమె వాదిస్తుంది. భర్త యింకా గేలిచేస్తే కంట తడిపెడుతుంది! ఇదంతా కూడా సెంటిమెంటలిజం తప్ప మరేమీ కాదని చెప్పబోయి, చేతకాక, ఎంతచదువుకున్నా ఆడవాళ్లు ఆడవాళ్ళే లెమ్మని ఆయన తగ్గి వూరుకుంటాడు!

ఇటువంటితగవే ఇప్పుడు హఠాత్తుగా వాళ్ళిద్దరిమధ్య చెలరేగింది.

"ఇప్పుడు మనం అనుకుంటున్నట్టుగానే వాళ్లుకూడా ఏదో మాటామాటాఅనుకుంటూ ఉండివుంటారు. అందులో పెద్ద విశేషమేముంది?" అన్నారు కలెక్టరుగారు విషయాన్నంతా తేల్చి వేస్తున్నట్లు.

"కావలసినంత విశేషముంది. మనకు మల్లే కపటమేమీ వాళ్ళకి తెలియదు. చెత్త సైకాలజీపుస్తకాలన్నీ చదివినమీదట మనం ప్రతిమనిషినీ పోస్టుమార్టం యొగ్జామినేషన్ చేసి వీడు 'సెంటిమెంటల్' అనీ, వాడు 'ఇంట్రోవర్ట్' అనీ, మరొకడు 'ఎక్స్ట్రావర్ట్' అనీ - ఇలాటి ఏదోఒక తెగకిందవాళ్ళనందర్నీ జమకట్టి పారేస్తాం. ఇంత పరీక్ష చేసినవాళ్లం మనిషిలో మానవత్వాన్ని మాత్రం గుర్తించం. కాని వాళ్లు అది మాత్రం చేస్తారు — యింత తేడావుంది!" అంది మనోరమ ఉపన్యాసధోరణిలో.

ఇక మాట్లాడి ప్రయోజనం లేదనుకున్నాడు కలెక్టరుగారు!

ఈ వాగ్వాదంవల్ల దుర్గ కృష్ణమూర్తుల పట్ల మనోరమకు శ్రద్ధ ఎక్కువయింది.

దీనికితోడు —

కట్నం అంటూ ఏమాత్రం పుచ్చుకోకూడదని కఠోరనియమం పాటించిన ఆదర్శ యువకుడు కృష్ణమూర్తి, అలా కట్నంగా ఇచ్చివుండవలసినదాంట్లో కొంత మొత్తాన్ని తన భార్య ఆమె తండ్రివద్దనుంచి తెప్పించబోయినందుకు గాను ఆమెను దండిస్తూన్న ఘట్టం అది అని తెలిసేసరికి ఆ దంపతులపట్ల మనోరమ అభిమానం మరింత పెరిగింది. అయితే ఇది తరవాత జరిగిన విషయం అనుకోండి!

అసలు దుర్గతో పరిచయం ఏర్పరచుకోడానికే మనోరమ చాలా చాకచక్యం చూపించవలసి వచ్చింది.

ఆ మర్నాడు — కూతురు కల్పనచేత బొమ్మల పెళ్లికి ఆదరాబాదరా ముహూర్తం పెట్టించి పేరంటానికి పిలిచిరమ్మని పనిమనిషిని తోడు ఇచ్చి పంపింది.

"తప్పకుండా రమ్మని అమ్మగారుకూడా చెప్పమన్నారండీ" అని పనిమనిషి చేత చెప్పించింది.

ఈ పేరంటానికి ఎలా వెళ్లాలో తెలియక దుర్గకు ఒక పట్టాన కాళ్లు ఆడలేదు. మరి కలెక్టరుగారి ఇంట్లో అంత అక్కర జరుగుతూ పిల్చినప్పుడు వెళ్లక తప్పుతుందా? కాని, ఎలా?

తన సాటివాళ్లతోతప్ప, తనకంటె పై తరగతి వాళ్లతో పూసుకు పూసుకు తిరగాలని తాపత్రయపడే మనిషి కాదు దుర్గ.

అయితే వివిధరకాల వ్యక్తులతో పరిచయం చేసుకోనడంలో ఆరితేరిన మనోరమ తన విషయంలోమాత్రం అంత పెడగా వుండ నవసరంలేదని దుర్గకు నమ్మకం కలిగింది. ఏ విధమైన డాబుదర్పాలు ప్రదర్శించకుండా దుర్గస్థాయికి దిగి ఆమెకు ధైర్యాన్ని కూర్చడానికి పూనుకుంది.

తను డబ్బు ఇబ్బందుల్ని గురించి చెప్పడంతో ఈ పని ప్రారంభించింది.

తను చాలా, బీద ఇంటి ఆడపడుచుననీ, తన భర్తమాత్రం చాలా ధనవంతుల బిడ్డే అయినప్పటికీ పెద్దవాళ్లు చెప్పినట్లు వినడానికి ఇష్టపడక స్వతంత్రంగా వ్యవహరించి అప్పుచేసి పై చదువు చదువుకున్నాడనీ, అప్పు ఇప్పటికీ తీరుస్తున్నామనీ—ఇలా చెప్పుకు వచ్చింది.

"మీకే ఇన్ని ఇబ్బందులుంటే, మా పరిస్థితి ఏమని చెప్పేదండీ!" అంది దుర్గ, చిరునవ్వు నవ్వుతూ.

ఆ తరువాత ఆట్టే ఎబ్బెట్టు లేకుండానే కబుర్లు సాగినై.

దీనికితోడు, ప్రస్తుతం కల్పన చేస్తూన్న బొమ్మల పెళికి పేరంటాళ్లుకూడా కావడంవల్ల వాళ్లిద్దరూ మరింత సన్నిహితులయారు. ఊరేగింపులు, భోజనాలతో బంతులాటలు —ఇత్యాది పెళ్లి వేడుకలలు, సతమతమౌతూ చిన్నపిల్లకల్పన పెళ్ళితంతు విషయంలో అక్కడక్కడ క్రమంతప్పితే, అనుభవంకల ఈ పేరంటాళ్లు సరిదిద్దేవారు. వారికే ఏమైనా సందేహాలొస్తే, ఒకరితో ఒకరు సంప్రతించుకుని, జ్ఞాపకం తెచ్చుకుని, ఆపైన నవ్వుకునేవారు!

కల్పనపడుతున్న హైరానా అంతా గమనిస్తూ దుర్గ, "ఈ పెళ్ళిసంబరా లేమిటమ్మా తల్లీ!" అని మనోరమతో "ఏమండీ! మీ అమ్మాయికి త్వరలో నే పెళ్ళిచేసెయ్యండి, నామాటవిని. ఉండండి, నేనే చూస్తాను—ఈపిల్లని ప్రేమతో విసిగించేసే పెద్ద అందగాణ్ణి ఒకణ్ణి!" అంది.

ఈమాటల్లో ఏదో ప్రత్యేకార్థంవున్నట్లు తోచింది మనోరమకు. దుర్గవైపు అలాగే చూస్తూ వుండిపోయింది మనోరమ.

"ఏమిటి, అలా చూస్తున్నారు?" అంది దుర్గ ఆ చూపుల్ని భరించలేక.

"ఏమీలేదు...." అంది మనోరమ ఆదరాబాదరాచూపు మరల్చి, తనలో తనే నవ్వుకుంటూ.

అసలువిషయ మేమిటో తెలుసుకోవాలనే కుతూహలం ఎక్కువయింది దుర్గకు. ఆ ఆలోచించే దేమిటో చెప్పమని మనోరమ పదేపదే అడగడం మొదలుపెట్టింది.

ఇలా కొంతసేపు వేధించనిచ్చి, "మరి నన్నిలా గుచ్చిగుచ్చి అడుగుతున్నారు. మీకేమీ అభ్యంతరం లేకపోతే, నేనొక విషయం అడుగుతాను చెప్తారా?" అంది మనోరమ.

ఇలా అడ్డసవాళ్లు వేయడంతో, దుర్గ "ఓ, తప్పకుండా!" అనక తప్పిందికాదు.

"మిమ్మల్ని నేను మొట్టమొదటిసారి చూచినప్పటివిషయం గుర్తుకు వచ్చింది. అప్పుడు మీరు, మీ ఆయన ఆ కిటికీముందు నిలబడి వున్నారు. మీఆయన ఏదో కేక లేస్తున్నారు. మీరు కన్నీరు కారుస్తున్నారు. ఈ విషయం మిమ్మల్ని అడగాలనుకుంటున్నాను. ఇప్పుడు చెప్పండి!" అంది మనోరమ.

 ## లేడీస్ క్లబ్ 

ఇలా తనని ఇరుకున పెట్టి, భార్యాభర్తల ముఖ్య విషయాన్ని గురించి అడగడంతో దుర్గ సిగ్గుతో కుంచించుకుపోయింది. ఒక్క క్షణంపాటుమాత్రం తటపటాయించింది.

"ఓస్! ఇదేకదా! అయితే చెప్తా వినండి" అని చులకనగా అని, "అసలు మా యింట్లో తగూలకు అర్థం పర్థం వుండవండీ. మొన్నటి గొడవ కూడా అలాటిదే," అంటూ ఉపోద్ఘాతం మొదలు పెట్టి ఇలా తెల్పింది: "తను ఊరికే నేల విడిచి సాము చేస్తానంటారండీ. ఒక్కమాట చెప్పండి—తను డబ్బు ఇబ్బందుల్లో వుండి, మా నాన్న డబ్బు సర్దగలిగి వున్నప్పుడు ఆయన దగ్గిర్నుంచి తీసుకుంటే తప్పా? అందులో తనకు కట్నంగా ఇచ్చి వుండాల్సిన డబ్బే వుంది కూడాను. మా నాన్న బాగా వున్నవాడు కాక పోయినప్పటికీ ఒక పాటి స్థితిమంతుడు. మా అక్కయ్య పెళ్లికి మా నాన్న మూడు వేలు కట్న మిచ్చాడు. అలాగే నా పెళ్ళిలో కూడా ఇస్తామన్నారు. కాని తను ససేమిరా వల్లకాద న్నారు. పోనీ నాకు నగలకింద ఇస్తామంటే, పెళ్ళికి పూర్వం ఏమి వున్నాయో అవి తప్ప కొత్తగా ఏమీ పెట్టడానికి వల్ల కాదన్నారు! తవకైనా డిగ్రీ కాకితం తప్ప వెనక ఆస్థి ఏమీ లేదు. వచ్చే జీతం డబ్బులు చాలక నానా ఇబ్బందీ పడుతున్నాం గనక, అప్పుగానైనా మా నాన్న దగ్గర తీసుకోండి, తరవాత చేతనైతే తీర్చుదురు గాని—అంటే, తీర్చలేని స్థితిలో అప్పు చెయ్యరాదు అందులోనూ మామదగ్గర అసలే కూడదు—అంటారు!..."

అయితే ఈ విషయాన్ని ఇంకా కొంచెం విడమర్చి చెప్పాలి—పెద్ద పిల్లకు కట్నం ఇచ్చి చిన్న పిల్లకు ఇవ్వక పోవడం, చిన్న పిల్లను అన్యాయం చేయడమని భావించాడు దుర్గ తండ్రి శివరామయ్యగారు. తన భర్తకి కట్నం రాకపోవడంవల్ల తన బావగారికి జరిగిన మర్యాదలో కొంత తన భర్తకు కొరవడినట్లు ఆధునిక యువతే అయినప్పటికీ దుర్గ కూడా అంతరాంతరంలో అప్పు

"బాబీ నీకు ఎన్ని అంకె లొచ్చునో చెప్పరా"
"ఒకటి, రెండు, మూడు, నాలుగు, ఐదు, ఆరు, ఏడు... ఎనిమిది, తొమ్మిది, పది..."
"భేష్. తరవాత?"
"జాకీ, మదాం, రాజు, ఆసు."

డప్పుడూ అనుకోకపోలేదు! శివరామయ్య గారు కూతురుతో ఇలా అన్నాడు: "కట్నం తాలుకు సొమ్మంతా మీ కోసమే భద్రంగా దాచి వుంచుతాను తల్లీ! మీకు ఏ మాత్రం డబ్బు అవసరంగా వున్నా సరే, మాట మాత్రం తెలియచెయ్యి... అత్తగారివన్నీ అర్థంలేని పట్టుదలలు!"

ఈ మాటలు ఆధారంగా తీసుకుని తను చేసిన తప్పిదమేమిటో దుర్గ ఇలా చెప్పింది: "ఈ మధ్య డబ్బుకు మరీ ఇబ్బందిగావుండి మా నాన్నకు ఉత్తరం రాశానండీ! అది ఆయన చేతికి చిక్కింది! దాన్ని దగ్గిరికి తెచ్చి, ఇది మీ నాన్నకు డబ్బు పంపమని రాసిన ఉత్తరం అవునో కాదో నిజం చెప్పమని పెద్ద ఒట్టు పెట్టారు. ఇంక ఏం చెయ్యను? కాని ఒప్పుకోకుండా ఉండలేకపోయాను. ఇలాటిపని యిక ఎన్నడూ చెయ్యవని నాచేత పెద్ద ఒట్టు పెట్టించారు! ... ఏమండీ, నేను చేసింది అంత తప్పపనా? మా నాన్న డబ్బే పనికిరాదా?"

అమాయికంగా దుర్గ వేసిన ఈ ప్రశ్నతో, అంతవరకూ దీర్ఘాలోచనలో వున్న మనోరమ స్పృహలోకి వచ్చింది. యేమి సమాధానం చెప్పాలో పాలుపోక, ఒక క్షణంపాటు తటపటాయించి, వెలితి గానవ్వి ఇలా అంది:

"కట్నాలు పుచ్చుకోకూడదని నేనూ అంటాను కాని, మీలాగా డబ్బు యిబ్బందుల్లోవుండి, అవతలవాళ్లు సహాయం చెయ్యగలిగివున్నప్పుడు, అప్పుగామాత్రం పుచ్చుకోవచ్చుననే నా అభిప్రాయం. అప్పు పుచ్చుకునేటప్పుడు తీర్చగలమా లేదా అన్న మీమాంసకంటె, తీరుద్దామనే సదుద్దేశం ఉండటమే ముఖ్యం ..."

తను చెప్పదల్చుకున్నంత సంతృప్తికరముగా సమాధానం చెప్పలేకపోయాననిపించింది మనోరమకు.

దుర్గకు బాధకలిగించే యీ విషయాన్ని మార్చాలనీ, ఆమెతో పరిచయం యింతటితో ఆగిపోకుండా చూడాలనీ మనోరమ ఉపాయాలు ఆలోచించడం మొదలుపెట్టింది. తనదగ్గరవున్న ఎంబ్రాయిడరీ, నిట్టింగ్ పుస్తకాలు మొదలైన సరంజామా అంతా తెచ్చి పడేసి అందులో ముఖ్యంగా కొన్ని కొన్ని కుట్టిమాడమని దుర్గచేతికిచ్చింది.

దుర్గ మెదలకుండా వాటిని ఇవతల పెట్టుకుంది.

వాటిపట్ల ఏవిధమైన ఆసక్తి ఆమెలో జనించినట్లు మనోరమకు కనిపించలేదు. మనోరమ మనస్సు చివుక్కుమంది.

ఆ తరువాత కొంతసేపు ఇద్దరూ కులాసాగా కాలక్షేపం చేశారు కాని మనోరమను ఆబాధ వెన్నాడుతూనే ఉంది. అసలీ కుట్టుసరంజామా అంతా ఎందుకు బయటికి తీశానా అని లోలోపల విచారించడం మొదలుపెట్టింది. ఇవన్నీ ఖర్చుతో కూడిన సరదాలనీ, ఇటువంటివాటికి ఆమెను పురికొల్పడం ఆమెను ఇబ్బందిపెట్టడం అయ్యుంటుందనీ నొచ్చుకుంది.

దుర్గ వెళ్ళినతరవాత చాలాసేపటి వరకూ ఏమిటో అలాగే పరధ్యానంగా కూర్చుండిపోయింది మనోరమ.

మర్నాడు ఉదయాన ఆమె వొక కొత్త విషయాన్ని కనిపెట్టింది —

తనకెందుకో కొంచెం పెందరాడే నిద్ర మెలకువవచ్చింది. లేచి అటూ ఇటూ చూస్తుండేసరికి దుర్గ ఆ కనుచీకటి మసకున గబగబా గుమ్మంలో నీళ్లుచల్లి ముగ్గు వేసుకుంటోంది. ఆశ్చర్యంతో అటువైపే చూస్తూ ఉండిపోయింది. బహుశా పనిమనిషి వచ్చివుండదని సర్ది చెప్పుకుంది.

తరువాత దొడ్లో మొహం కడుక్కుంటున్నప్పుడు, పనిమనిషిని అడిగితే, "వర్సమ్మను మాన్పించేశారంటమ్మా! పనిమనిషి అక్కర్లేదన్నారంట. అది నాకు చెప్పి వారం రోజులాయె!" అంది.

పాపం దుర్గ చెయ్యరానిపనులు, చెయ్యలేనిపనులు అన్నీ చెయ్యవలసి వచ్చినట్లు బాధపడింది మనోరమ.

కలెక్టరుగారు సాయంత్రం ఆఫీసునుంచి వచ్చి తీరికగా కూర్చుని పిచ్చాపాటీ మాట్లాడుతున్న సమయంలో ఈ ప్రస్తావన వచ్చింది. ఆయనకు తన గౌరవమేదో దెబ్బతిన్నట్లనిపించింది మనోరమ చెప్పే మాటల వల్ల.

"సమాస్తాల జీతాలు తక్కువగా వున్నాయని నేనూ ఒప్పుకుంటానుగాని, ఇళ్ళ దగ్గర పనిమనుషుల్ని పెట్టుకొనడానికి వీలులేనంత తక్కువగా వున్నాయంటే మాత్రం ఒప్పుకోను" అన్నారు కలెక్టరు గారు.

"మరి వాళ్లు పనిమనిషిని తీసేసినమాట వాస్తవమేగదా!" అంది మనోరమ.

"బహుశా వాళ్లు దుబారామనుషులై వుండాలి" అన్నారు కలెక్టరుగారు.

"ఖర్చు తగ్గించుకోవాలంటే పనిమనిషినే మాన్పించుకోవలసిన స్థితిలో వున్నవాళ్లు దుబారా ఏంచేస్తారండీ!"

కలెక్టరుగారు సమాధానానికి ఒక క్షణం పాటు తటపటాయించవలసి వచ్చింది. చివరికి ఇలా తప్పుకున్నారు: "ఆ పనులన్నీ ఇంతకాలమూ పనిమనిషి చేసిందికదా, మరి దానిమీద సానుభూతి చూపవేం? పాపం ఆ పనైనా చేసుకునే వీలులేకుండా దాని నిష్షు పని మాన్పించారాయె!"

మనోరమ ఆలోచనలో పడ్డది. నిజమే, తనకు పనిమనిషిమీద ఆపాటి సానుభూతి ఎందుకు కలగలేదు? ఎంత ఆలోచించినా మనోరమకు సమాధానం లభించలేదు. వరసమ్మ ఇబ్బందులు నిజంగా ఎక్కువైనవే. వర్సమ్మను మించి ఇబ్బందులు పడే వాళ్లుకూడా వుండేవుంటారు. మరి వాళ్ళ మాటో!

ఒకక్షణానికి తెప్పరిల్లింది మనోరమ. తనభర్త తననేదో అగాధంలోకి తోసేశా

 లేడీస్ క్లబ్ 

డనిపించింది. సానుభూతికికూడా పరిమితు లుండక తప్పదు గనక తన సానుభూతికి పరిమితి దుర్గదగ్గర అనుకుంది. ఉత్తమా దర్శాలు, పరస్పరానురాగం గల యువదంపతులు ... ఆ ఆదర్శాలకు, అనురాగానికి ముప్పుతేబోయే పరిస్థితులు – ఈ సంఘర్షణే తన సానుభూతికి హేతువుగా నిర్ధారణ చేసుకుంది.

అసలు విషయాన్ని తనభర్త పెడదారి పట్టించాడని అప్పటికిగాని మనోరమ గుర్తించలేదు!

"ఇంతకీ నాకు సమాధానం చెప్పకుండా తెలివితేటలుగా మాట మార్చారు బాగానే వుంది కాని... వీళ్లజీతాలు ఎందుకిలావున్నాయండీ?" అంది మనోరమ.

"దీనికి మూలమేమిటో అర్థం కావాలంటే పబ్లిక్ ఫైనాన్సు మొదలు పవర్ పాలిటిక్సు దాకా తెలిసి వుండాలి .... ఏమైనా కాని ఇందులో నావల్ల అయేది ఏమీ లేదు. మనం చేయగలిగింది ఏమీ లేని విషయాలన్నుగురించి నేను ఆలోచించను. నువ్వు చేయగలిగింది ఏమైనావుంటే చూడు!" అన్నారు కలెక్టరు గారు.

తను "సెంటిమెంటల్" అని ఇది మరోక సారి ఎద్దేవా చేయడం కాబోలు అనుకుంది మనోరమ.

మర్నాడు సాయంత్రం మనోరమ లేడీస్ క్లబ్బుకి వెళ్ళింది. గుమ్మంలో అడుగు పెడుతూ వుండగానే డాక్టర్ కృష్ణమూర్తిగారి అమ్మాయి గిరిజ "హాల్లో! ఎన్నాళ్లకి దర్శనాలు!" అని హడావిడిగా నవ్వుతూ ఆహ్వానించింది. హాల్లో కూర్చుని అంతవరకూ బుద్ధి మంతనంగా పత్రికలు చదువుకుంటున్న వాళ్ళంతా కూడా తల ఎత్తి స్నేహ పూర్వకంగా నవ్వారు.

"నిన్నా మొన్నా నేకదా అసలిక్కడికి రానిది? అంత మాత్రానికే ఎన్నాళ్ళో— అంటున్నావా?" అంది మనోరమ చాలా చనువుగా.

"అది కాదండీ! మీరు రాకపోతే రెండు రోజులు రెండు యుగాల్లాగా వుంటాయి. అందుకని అలా అంటాను!" అంది గిరిజ కొంటెగా.

"ఆ మాట మాత్రం నిజమేకాని, ఆ భావం మాత్రం దానిది కాదండీ...అది వట్టి దొంగ మొహం!" అంది సుమిత్ర.

వీళ్లిద్దరికీ ఒక్కక్షణం సేపు కూడా పడదని తెలిసినా, అక్కడి వాళ్ళందరూ ఒక్కసారి గొల్లున నవ్వారు.

"ఎలా వున్నారు మనవాళ్లందరూ?... ఒక్కసారి చుట్టి పెట్టివస్తాను," అంటూ మనోరమ అక్కడినుంచి బయలుదేరింది.

పక్కగదిలో పింగ్-పాంగ్ ఆట మాంచి రసకందాయంలో ఉంది. అంత ఆటమధ్యలోను, సుశీల సర్వుచేయబోతున్న దల్లా అట్టే నిలిచిపోయి, "అదుగో సెక్రెటరీ గారు రానేవచ్చింది. కమలా! చెప్పవే..." అని మళ్లా ఆటలోకి దిగింది.

ఏమిటన్నట్లు మనోరమ కమలవైపు చూస్తూఉండేసరికి, "అఁ...ఏమీ లేదండీ! ఈసారి మాచెస్‌లో ఆవిడ మమ్మల్ని చిత్తుగా ఓడిస్తుందిట. అందుకని ఆవిడగారికి పే—ద్ద కప్పు కొని దాచి ఉంచాలట!" అంది ఇంజనీరుగారి కోడలు కమల ఈసడింపుగా.

వెనక వరండాలో కేరమ్సు ఆడుకుంటున్న ఇందిర, విష్ణుప్రియ, రాధ, వసంత, పైన కూర్చుని చూస్తున్న విమల, సీత, శాంత వగైరాలు ఆటకు సంబంధించిన ఏదో విషయాన్ని గురించి తీవ్రంగా తర్జనభర్జన చేస్తూ పరిష్కారం కుదరక, ఇంతలోకే మనోరమ అటు పోతూవుండడం చూసి, "సెక్రటరీ గారూ! మీరొకమాటు ఇటు రావాలి!" అన్నారు.

"ఇప్పుడేవస్తాను," అంటూ అటు వెళ్ళకుండానే మనోరమ టెన్నిస్ కోర్టువైపు నడిచింది.

ఇంకొక్క క్షణంలో సెట్టు పూర్తికాబోతోందనీ, తరవాత ఆటకు వుండమనీ హెల్తు ఆఫీసరుగారిభార్య కోమలవల్లి మరీ మరీ బలవంతం చేసింది. మిగతా వాళ్లంతా కూడా ఆహ్వానించారు. కాని, ఆఫీసులో కొంచెం పనుందని చెప్పి మనోరమ వెనక్కి బయలుదేరింది.

ఆఫీసుగది చేరుకునేసరికి హాల్లోవున్న వాళ్ళల్లో చాలా మంది ఆఫీసులోకి మూగారు. అందర్నీ పరామర్శిస్తుండగా, గవర్నమెంటు ప్లీడరుగారమ్మాయి రమణి కళ్లు మనోరమ తొడుక్కున్న చోళీమీద పడ్డాయి.

"ఎక్కడ కుట్టించారండీ ఆ చోళీ?" అంది రమణి.

"ఏం?" అంది మనోరమ బిత్తరపోయి.

"ఎంతో బాగుందండీ!" అంది రమణి ఒళ్ళంతా కళ్లుచేసుకు చూస్తూ.

వెక్కిరించబోతోందేమోనని భయపడ్డ మనోరమ ఈ ప్రశంసకు రెండింతలు ఆశ్చర్య పడింది. ఎందువల్లనంటే, ఆ చోళీ తను కుట్టుకున్నదే! మిషన్‌కుట్టు వగైరాలలో తనకు మంచి నేర్పు వున్నప్పటికీ, ఆ నేర్పు ఎదుటివాళ్ళ ప్రశంసను ఇంతగా చూరగొంటుందని ఆమె అనుకోలేదు. నిజానికి ఆచోళీ చాలా బాగున్నదగ తనుకూడా అనుకోకపోలేదు! ఫాషన్ మాగజైన్‌లో ఒక డిజైన్ప్రకారం తను చేసిన స్వంతప్రయత్నమది.

మనోరమ మనస్సులో ఏదో మెరుపు మెరిసినట్లయింది!

"ఏమిటోనండీ, నేనేది ఇచ్చినా సరే మిషన్‌వాడు నిప్పెట్టుకుని చక్కావస్తాడు! అక్కడికీ వాడిప్రాణాలన్నీ తెగేట్టు ఒకటికి పదిసార్లు చెప్తాను, ఏమాదిరిగా కుట్టాల్సిందీను..." అంటూ రమణి సణుక్కుంటోంది.

మనోరమ తనచోళీ బాగుందని వీలైనంత ఎక్కువమందిచేత అనిపించాలనుకుంది!

నిజానికి చోళీగుడ్డ ఏమీ అంత ప్రశస్తమయిందికాదు. మామూలు క్రేప్ సిల్కు. అయితే చోళీ ఫాషన్‌మాత్రం కొత్తది.

"నిజంగా అంత బాగుందా?" అంది వాళ్ళనందర్నీ ఉద్దేశించి.

"మిమల్ని రెండు తన్ని అదికాస్తా విప్పి తీసిపట్టుకెళ్ళిపోదామా అనిపిస్తోంది!" అంది ఇన్‌కమ్‌టాక్సు ఆఫీసరుగారి మేనకోడలు నళిని.

అందరూ గలగలా నవ్వారు.

"మీతో మేం అందాలపోటీకి రాముగానీ మీరు బట్టలు యెక్కడ కుట్టిస్తారో కాస్త మాకూ్కడా చెపుదురూ" అంది రమణి.

మనోరమ చాలా జాగ్రత్తగా యిలా చెప్పడం ప్రారంభించింది: "చెప్పడానికేమీ సందేహంలేదు కాని, ఒక్కందుకు మాత్రం సందేహిస్తున్నాను. నాకు బట్టలుకుట్టేది మామూలువాళ్లెవరూ కాదు; గుట్టుగా బతుకుతున్న ఒక కుటుంబీకురాలు. అయితే ఆవిడ చాలా బాగా కుట్టగల దనడానికి సందేహం ఏమీ లేదు; నేనూ ఒప్పుకుంటున్నాను. ఆవిడ ఏదో కొద్దిమందికి తప్పితే, భారీ ఎత్తున తాను కుట్టడం లేదని చెప్పింది. అయినా మీకు కూడా కావాలంటే అడిగి చూస్తాను, ఒప్పుకుంటుందేమో..."

మనోరమ మాటలకు అడ్డంవచ్చి "కాస్త అడిగిచూద్దురూ, మీకు పుణ్యం వుంటుంది!" అంది సుమిత్ర.

ఇక క్లబ్బులో వేరే పనేమీ చేయ బుద్ధి పుట్టలేదు మనోరమకు. ఒకసెట్టు టెన్నిస్ మాత్రం ఆడి ఇంటికి తిరిగివచ్చింది.

(మిగతా కథ పై వారం.)

# ఈవారం ముఖచిత్రం



ఈవారం ముఖచిత్ర తార సుచిత్రాసేన్.

బిమల్‌రాయ్ చిత్రం 'దేవదాస్'లో పార్వతిగా నటిస్తున్న బెంగాలీ తార సుచిత్రాసేన్. ఈమె నటించిన తొలిచిత్రం క్రాజీ. అందులో ప్రధాన భూమికనే నిర్వహించింది. ఆ చిత్రంతో ఆమె తారాపథాన్నందుకొంది. ఈమె నటించిన చిత్రాలన్నీ బాక్సాఫీస్ చిత్రాలయ్యాయి. ఈమె ఇంతవరకూ నిర్వహించినవన్నీ గంభీరమైన భూమికలే. ఇటువంటి భూమికలంటేనే ఆమెకు అభిమానం. సుచిత్రా సేన్ శాంతినికేతన్‌లో విద్యాభ్యాసం చేసింది. వివాహిత. నాలుగేళ్ళ కుమార్తె ఉంది.

'దేవదాస్' ఈమె నటించిన మొట్టమొదటి హిందీ చిత్రం



బొంబాయి మహిళామండలి ఏర్పాటుచేసిన బాలచలన చిత్రోత్సవానికి ముఖ్యమంత్రి శ్రీ మురార్జీ దేశాయ్ డిసెంబరు 4న ప్రారంభోత్సవం చేశారు. (ఎడమనుండి మూడవవారు): మహిళామండలి అధ్యక్షురాలు శ్రీమతి మీనాక్షీభాస్లే. 80 వేలమంది బాలికలు ఉత్సవంలో పాల్గొన్నారు.



వార్నర్ బ్రదర్స్ సినిమాస్కోప్ చిత్రం 'లాండ్ ఆఫ్ ది ఫరోవాస్'లో నటించిన కొత్తతార జోన్ కాలిన్స్.





బిమల్‌రాయ్ నిర్మించిన హిందీ "దేవదాసు"లో దేవదాసుగా దిలీప్‌కుమార్.

ఎ. ఐ. పిక్చర్స్ వారి 'ఏకాదశి'లో త్రిలోక్ కపూర్, మాలాసిన్హా, సులోచన.

* * * *

ఫిలింస్థాన్ వారి అరబ్బీచిత్రం 'అబేహయాత్'లో హాస్యనటుడు రామూదత్తాల్., ప్రేమనాథ్, స్మృతివిశ్వాస్.





జనవరి 14 నుండి మన దేశంలో పర్యటించనున్న సుప్రసిద్ధ అమెరికన్ బెలారినా మార్థా గ్రహం. బొంబాయి కలకత్తా, మద్రాసు మొదలైన నగరాలలో ఈమె 'బాలే' ప్రదర్శనలు ఇస్తుంది. నిరంతరాన్వేషణను చిత్రించే 'డర్క్ మెడో' అనే బాలేలో ఒక భంగిమను ఈచిత్రంలో చూడవచ్చు.

# 'మిర్జా గాలిబ్'కు రాష్ట్రపతి సువర్ణ పతకం

## తెలుగు చిత్రాలలో "పెద్ద మనుషులు" కు రజత పతకం



1954 వ సంవత్సరానికి ఉత్తమచిత్రంగా ఎన్నికఅయి రాష్ట్రపతి సువర్ణపతకం అందుకొంటున్న మినర్వామూవిటోన్ చిత్రం మిర్జా గాలిబ్ లో గాలిబ్ భూమిక నిర్వహించిన భరత్ భూషణ్.

దేశం మొత్తంమీద 1954 వ సంవత్సరంలో నిర్మించబడ్డ చిత్రాలలో మినర్వా మూవిటోన్ హిందీచిత్రం 'మిర్జా గాలిబ్'కు రాష్ట్రపతి సువర్ణ పతకం ఇవ్వాలని, ప్రభుత్వం నియమించిన కేంద్రసంఘం నిశ్చయించారు. డాక్యుమెంటరీలలో కేంద్ర సమాచార, ప్రసారశాఖ ఫిలింస్ డివిజన్ నిర్మించిన 'స్పిరిట్ ఆఫ్ ది లూం' అనే చిత్రానికి సువర్ణపతకం లభించింది. పిల్లల చిత్రాలలో, ప్రధానమంత్రి పేరిట ఇచ్చే సువర్ణ పతకంగాని, ప్రశంసా పత్రంగాని అందుకోతగ్గ చిత్రం ఒక్కటికూడా లేదు.

ప్రాంతీయ చిత్రాలలో ఉత్తమ తెలుగు చిత్రంగా ఎన్నికఅయిన 'వాహినీవారి' 'పెద్దమనుషులు'కు రాష్ట్రపతి రజతపతకం ఇవ్వ నిశ్చయించారు. నేషనల్ ఆర్ట్ థియేటర్స్ వారి 'తోడుదొంగలు,' భరణీవారి 'విప్రనారాయణ' చిత్రాలకు ప్రశంసా పత్రాలిచ్చి గౌరవిస్తున్నారు. బహుమతి ప్రదానం ఈ నెల 21 న.

అఖిల భారత స్థాయిలో ప్రశంసా పత్రాలందుకొంటున్న రెండు చిత్రాలలో ఒకటి చంద్రథారా ప్రొడక్షన్స్ వారి మలయాళ చిత్రం నీలకుయిల్; రెండవది హితేన్ చౌదరి ప్రొడక్షన్స్ హిందీచిత్రం 'బిరాజ్ బహు' డాక్యుమెంటరీలలో ఫిలింస్ డివిజన్ నిర్మించిన డార్జిలింగ్, గోల్డెన్ రివర్ అనే రెండు చిత్రాలకు అఖిలభారత ప్రశంసా పత్రాలు ఇవ్వ నిశ్చయించారు.

ఉత్తమ చిత్రాలను గుర్తించి, వాటి నిర్మాతలను గౌరవించడం ద్వారా చలన చిత్రకళ సర్వతోముఖాభివృద్ధికి దోహదం చేయాలన్న సంకల్పంతో భారత ప్రభుత్వం గత సంవత్సరం ఈ బహుమతులను ఏర్పాటు చేశారు. ఈ ఏడాది ప్రాంతీయ చిత్రాలలో ఉత్తమ చిత్రాలకు రజత పతకాలు, తరువాత ఎన్నతగినవాటికి ప్రశంసా పత్రాలు ఇవ్వ నిశ్చయించారు.

ఈ సంవత్సరం ఉత్తమ చిత్రాలు నిర్ణయించిన కేంద్ర సంఘానికి బీహారు గవర్నరు శ్రీ ఆర్. ఆర్. దివాకర్ అధ్యక్షుడు. మూడు ప్రాంతీయ సంఘాల అధ్యక్షులు శ్రీ టి. ఎం. నారాయణస్వామి పిళ్లె (మద్రాసు) శ్రీ ఎం. డి. భట్ (బొంబాయి) ప్రొ॥ ఎన్. కె. సిద్ధాంత (కలకత్తా) కూడా ఇందులో ఉన్నారు. ఫిలిం పరిశ్రమ తరఫున శ్రీయుతులు ఎస్. ఎస్. వాసన్, వి. శాంతారాం, అర్ధేందు ముఖర్జీ ఉన్నారు. శ్రీమతులు కమలాదేవి చటోపాధ్యాయ, లీలావతీ మున్షీ. ఆచార్య రాయప్రోలు సుబ్బారావు, సయిన్ నరూలా ప్రభృతులు సభ్యులు.

రాష్ట్రపతి సువర్ణ పతకం అందుకొంటున్న 'మిర్జా గాలిబ్'కు హిందీ చిత్రాలలో ఉత్తమ చిత్రంగా రజత పతకం లభి

# 'మిర్జా గాలిబ్'కు సువర్ణ పతకం

స్తున్నది. ఇందులో అమరకవి గాలిబ్ పాత్రను భారత్ భూషణ్ నిర్వహించాడు. బొంబాయి ప్రాంతీయ సంఘం ఈ చిత్రానికి ప్రశంసాపత్రాలు లభిస్తున్నాయి. మరాటీ చిత్రాలలో 'మహాత్మా ఫూలే' బెంగాలీ చిత్రాలలో 'చాలేకార్'లకు రజత పతకాలు లభిస్తున్నాయి.

మద్రాసు ప్రాంతీయసంఘం రజతపతకానికి సిఫార్సు చేసిన 'పెద్దమనుషులు' వాహినీచిత్రం. దర్శకుడు శ్రీ కె. వి. రెడ్డి. ప్రశంసాపత్రాలందుకుంటున్న వాటిలో ఒకటి నేషనల్ ఆర్టు థియేటర్సువారి 'తోడు దొంగలు'. దర్శకుడు శ్రీ యోగానంద్. రెండవది భరణీవారి 'విప్రనారాయణ' — దర్శకుడు శ్రీ రామకృష్ణ.

మద్రాసు ప్రాంతీయసంఘం చూచిన మిగతా తెలుగుచిత్రాలు మిస్సమ్మ, అమరసందేశం, అంతా మనవాళ్ళే. ఈ ప్రాంతీయ సంఘం అధ్యక్షుడు శ్రీ టి. ఎం. నారాయణస్వామిపిళ్లై. శ్రీయుతులు ఆర్. బి. రామకృష్ణంరాజు, రాయప్రోలు సుబ్బారావు, ఎ. రామయ్య, కె. రామనాథ్, డా॥ వరదరాజన్, డా॥ అయ్యప్పన్, శ్రీమతి ఎస్. మంజుభాషిణి సభ్యులు.



ఉత్తమ తెలుగుచిత్రంగా నిర్ణయింపబడిన "పెద్దమనుషులు" దర్శకుడు శ్రీ కె. వి. రెడ్డి.



భయానక చిత్రాలు తీయటంలో సిద్ధహస్తుడని ప్రపంచవ్యాప్తంగా ఖ్యాతినందిన అమెరికన్ దర్శకుడు ఆల్‌ఫ్రెడ్ హిచ్‌కాక్. ఈయన ఈనెల మొదటి వారంలో మనదేశం వచ్చారు.

స్పెల్‌బౌండ్, నొటోరియస్, పారడైన్ కేస్, రోప్, స్ట్రేంజర్స్ ఆన్ ఎ ట్రెయిన్, రియర్ విండో ఈయన చిత్రాలలో పేరెన్నికగన్నవి. ఇటీవలిచిత్రం 'టు క్యాచ్ ఎ థీఫ్'

# సినిమా వార్తలు

వాహినీ ప్రొడక్షన్స్ పేరిట పొన్నలూరి బ్రదర్స్ నిర్మిస్తున్న 'భాగ్యరేఖ' చిత్రానికి పాటల రికార్డింగ్ పూర్తి కావచ్చింది. ఈ చిత్రంలో జమునను నాయికగా తీసుకున్నారు. దర్శకుడు శ్రీ బి. ఎన్. రెడ్డి. కవి దేవులపల్లి కృష్ణశాస్త్రి.

* * *

లలితా ఫిలిమ్స్ చిత్రం 'చరణదాసి' శ్రీ తాతినేని ప్రకాశరావు దర్శకత్వాన చురుకుగా తయారవుతోంది. ఎన్. టి. రామారావు, నాగేశ్వరరావు, రంగారావు, రేలంగి, చదలవాడ, సావిత్రి, జానకి, సూర్యకాంతం నటిస్తున్నారు. సంగీతం శ్రీ రాజేశ్వరరావు.

* * *

విజయావారు తమిళంలో తీసిన 'గుణసుందరి' చిత్రం ఈనెల 16న విడుదల అయింది. ఇందులో గుణసుందరిగా సావిత్రి నటించింది. విజయావారి తరువాతి చిత్రం 'శశిరేఖా పరిణయం' నిర్మాణం త్వరలో ప్రారంభం కాబోతున్నది. దర్శకుడు శ్రీ కె. వి. రెడ్డి. సంగీతం ఘంటసాల.

* * *

'టింగరంగా' నిర్మాత శ్రీ శేషాచలం చెట్టియార్ మహీ ప్రొడక్షన్స్ పేరిట 'శ్రీ గౌరీ మహాత్మ్యం' నిర్మిస్తున్నారు. ఎన్. టి. రామారావు, రంగారావు, ముక్కామల, శ్రీరంజని, సూర్యకాంతం, సూర్యకళ నటిస్తున్నారు. దర్శకుడు యోగానంద్. సంగీతం: ఓగిరాల, రాజు.

* * *

విక్రం ప్రొడక్షన్స్ 'తెనాలి రామకృష్ణ'కు సంబంధించిన కొన్ని చారిత్రాత్మక దృశ్యాలు తీసే నిమిత్తం దర్శకుడు శ్రీ బి. ఎస్. రంగా నాగేశ్వరరావు, జమునలను వెంటబెట్టుకొని ఈ నెల 14 న హంపి వెళ్లారు. 17 వ తేదీవరకూ, అక్కడ కథకు సంబంధించిన సన్నివేశాలు చిత్రించారు. ఈచిత్రం విడుదల జనవరి మొదటివారంలో కాని జరుగకపోవచ్చునని తెలుస్తోంది.

* * *

ఎ. వి. ఎం. వారు తీస్తూన్న 'నాగుల చవితి' జనవరి 7 న విడుదల కాబోతోంది. 'ఆదర్శ సతి' అన్న పేరుతో ఈచిత్రాన్ని

కన్నడంలోకూడా తీస్తున్నారు. జమున, జానకి, రఘురామయ్య, మోహన్, నాగేంద్రరావు నటిస్తున్న ఈ చిత్రానికి శ్రీ చిత్రపు నారాయణమూర్తి దర్శకుడు.

## ఫిలింస్థాన్ వర్ణ చిత్రంలో జమున

సినీతార జమున త్వరలోనే ఫిలింస్థాన్ వారు నిర్మించే గెవాకలర్ చిత్రంలో నటించవచ్చునని తెలుస్తూంది. దక్షిణభారత దేశంనుండి ప్రతిభగల వర్ధమాన నటిని హిందీ చలనచిత్రరంగంలో ప్రవేశపెట్టాలన్న సంకల్పంతో ఫిలింస్థాన్‌వారు జమునను సంప్రతించారట. జమున ప్రస్తుతం ఇక్కడ ఆరు చిత్రాలలో ఉంది. వాటిలో జూపిటర్ వారి సంతోషం ఈనెల విడుదల అయింది. విక్రమ్‌వారి తెనాలిరామకృష్ణ, ఎ. వి. ఎం. వారి నాగులచవితి వచ్చేనెల విడుదల అవుతాయి. వాహినీవారి 'భాగ్యరేఖ'లో మొన్ననే బుక్ అయింది.

## శోచనీయం

పిల్లలకోసం తీసినచిత్రాలలో ఉత్తమమైన దానికి ప్రధానమంత్రి పేరిట ఒక సువర్ణ పతకం యిచ్చి గౌరవించాలని ప్రభుత్వం సంకల్పించారు. తీరా యీపాటికి వచ్చిన చిత్రాలుచూడగా, యీ పతకాన్ని గాని, కనీసం ప్రశంసాపత్రాన్ని గాని అందుకోడానికి అర్హతగల చిత్రం ఒక్కటి కూడా కనిపించలేదు. అందుకని ఆ బహుమతి దేనికీ ఇవ్వకుండా ఊరుకోవలసివచ్చింది. ఇది చాలా శోచనీయం.

రెండేళ్లుగా, పిల్లలచిత్రాలు తీయాలనే ఉద్ఘాటనలూ, తీస్తామనే అభిభాషణలూ, హామీలూ వినబడుతూనే ఉన్నాయి కాని, కనబడ్డచిత్రం ఏదీలేదు. నిర్మాతల గిల్డు సభ్యులు చేసిన వాగ్దానాలలో ఒక్కటి కూడా కార్యరూపం దాల్చలేదు. ఈ నెల 4వ తేదీనుండి పదిరోజులపాటు బొంబాయిలో బాల చలనచిత్రోత్సవం జరిగింది. 17 సినిమాహాలులలో దాదాపు 70 చిత్రాలు చూపించారు. ఈ 70 లో భారతీయ చిత్రం ఒక్కటే. అదైనా పాత చిత్రం 'పాంపోష్'. మిగతా వన్నీ విదేశాల చిత్రాలు.

ఈ శోచనీయ పరిస్థితికి రెండు కారణాలు చెబుతున్నారు. ఒకటి కథలు లేకపోవడం. మనకున్న అపార కథా సాగరం సద్వినియోగం చేసుకోవడానికి పూనుకుంటే ఈ మాట అనుకోవలసిన అవసరం ఉండదు. కార్టూన్ చిత్రాలకూ, మామూలు చిత్రాలకు కూడా కావలసిన కథలు పుష్కలంగా ఉన్నాయి.

ఇక రెండవది, ఈ చిత్రాలు గిట్టుబాటు కావన్న విషయం. ఇది మాత్రం నిజమే. కేవలం పిల్లలకై చిత్రాలు నిర్మిస్తే, అవి, పెద్ద పెద్ద సెట్టింగులు, నృత్యసంగీతాలువుండే పెద్దచిత్రాలవలెకి గిట్టుబాటుతాయా అన్నది అనుమానాస్పదమే. నిర్మాతలూ, ఎగ్జిబి



"బాద్షా సలామత్" లో స్మృతిబిశ్వాస్, బి. ఎమ్. వ్యాస్.

# బొంబాయి సినిమా లేఖ

ఐ. ఎం. పి. పి. ఎ. అధ్యక్షపదవి స్వీకరించినవాడు శ్రీ ఎస్. కె. పాటిల్, తను ముఖ్యలక్ష్యం దేశంలోని చలనచిత్ర నిర్మాతలందరినీ ఒక త్రాటిమీదకు తేవడమే నని చెప్పారు. ఈనాటికి అది సిద్ధించి నిర్మాతలసంఘం రూపం దాల్చబోతున్నది. ఈవిషయంలో కృషిచేసిన మరొక వ్యక్తి శ్రీ ఎస్. ఎస్. వాసన్, కొత్త సంఘానికి నియమనిబంధనావళి ముసాయిదా తయారుచేసి దక్షిణభారతచలనచిత్రసంస్థ, బెంగాల్ ఫిలిం నిర్మాతల సంఘం, బొంబాయిలో నిర్మాతల గిల్డు సభ్యుల పరిశీలనకు పంపించారు. ఈసంఘంలో సభ్యత్వానికి రుసుము ఏడాదికి వెయ్యి రూపాయలు ఉండాలని ప్రస్తుతానికి నిశ్చయించారు.

కొంతమంది నిర్మాతలు ఇది చాలా ఎక్కువ అని అంటున్నారు కాని, లక్షల కొద్దీ ఖర్చుచేసే నిర్మాతలు ఈ రుసుము కట్టడానికి వెనుకంజవేయడం అర్థరహితమని, ఆమాత్రం స్తోమతు లేకపోతే నిర్మాత కావడం ఏమిటనీ నిర్వాహకులు వాదిస్తున్నారు. మొత్తానికి ఈ రూపేణా చలనచిత్ర నిర్మాతలంతా ఒకే సంఘంగా ఏర్పడి, పరిశ్రమ పాఠక బాధకాలను ముక్తకంఠంతో ప్రభుత్వానికి చెప్పడానికి అవకాశం ఏర్పడడం ముదావహం. చలనచిత్ర పరిశ్రమ చరిత్రలో దీనికి విశిష్టస్థానం ఉంటుంది.

* * *

ప్రతిభ ఉన్నా ప్రఖ్యాతిలేక చిన్నతారలుగా పిలువబడే నటీనటులందరినీ ఒక సంఘంగా ఏర్పాటుచేసి, వారి అగచాట్లకు అడ్డుకట్ట వేసి చిరస్మరణీయుడైన నవీన్ యాజ్ఞిక్ గతవారం హఠాత్తుగా మరణించారు. ఈయన కృషిఫలితంగా చిన్నతారలందరికీ, వారివారి శక్తిసామర్థ్యాలనుబట్టి వేతనాలు ఏర్పాటు అయ్యాయి. చిన్న మాపు మాడబడే ఈ నటీనటులనుండే శ్యామ, శశికళవంటివారు తారాపథానికెక్కారు. నవీన్ యాజ్ఞిక్ లోగడ 'జంబుకాకా' అనే చిత్రంలో ప్రధానభూమిక నిర్వహించారు. దరిమిలాను, ఆయన చిన్నతారల సముద్ధరణకే కృషి చేస్తూ వచ్చారు.

* * *

బొంబాయిలో గత వారం మూడు కొత్త చిత్రాలు సీమ, నాటా, అబ్-ఎ-హయాత్ విడుదల అయ్యాయి. డాగ్, పరిణీత తీసిన అమియ చక్రవర్తి 'సీమ' చిత్రాన్ని నిర్మించారు. రచన, దర్శకత్వం కూడా ఆయనే నిర్వహించారు. సమాజంలో అన్యాయాలకు గురి అయి, ఎదురు తిరిగిన అనాథ కథ. ఆమె మనోవేదనను అర్థం చేసుకుని, సానుభూతితో ఆదరించిన ఒక యువకునివల్ల ఆమె జీవితంలో నవాధ్యాయం ప్రారంభం అవుతుంది. 'అనాథ' భూమిక నిర్వహించిన నూతన్ సమర్థ్ చాలా ప్రతిభావంతంగా నటించింది. కొన్ని కొన్ని సమావేశాలలో ఆమె తీరు తెన్నులు, అందచందాలు, ఒకనాటి ప్రముఖతార శోభనా సమర్థ్‌ను గుర్తుకు తెస్తాయి. సంగీతం అంతంత మాత్రంగా ఉంది.

* * *

డి. ఎన్. మధూక్ దర్శకత్వాన మధుబాల నిర్మించిన చిత్రం 'నాటా' మధ్యరకం చిత్రం. మధుబాల, ఆమెసోదరి 'చంచల్' అభిభట్టాచార్య నటించారు. తెచ్చిపెట్టినట్లు సాగిన నటన, చిలిపితనం, పాడిందేపాటగా సాగిన దర్శకత్వం చిత్రాన్ని ఈస్థితికి తెచ్చాయనిపిస్తుంది. దర్శకుడే కథకూడా వ్రాశారు. అదీ వీటికి తగ్గట్టుగానే నడచింది. సంగీతం ఇంపుగానేవుంది కాని అమోఘంగా లేదు.

* * *

'అబ్-ఎ-హయాత్' అరబ్బీకథ. ఫిల్మిస్తాన్ నిర్మించిన ఈ చిత్రానికి దర్శకుడు రామన్‌లాల్ దేశాయ్; శశికళ, ప్రేమ్‌నాథ్, స్మృతిబిశ్వాస్, అమిత నటించారు. ఈ చిత్రంలో సంగీతం అనేకరకాలబాణీలు కలసి ఫలానా అని చెప్పడానికి వీలులేనిదిగా ఉంది. నృత్యాలు, కత్తియుద్ధాలు పుష్కలంగా ఉన్నాయి. సామాన్య ప్రేక్షకులను ఈచిత్రం బాగా ఆకర్షిస్తుంది. ★

## "పథేర్ పాంచాలి"

ప్రసిద్ధ బెంగాలీ చిత్రం "పథేర్ పాంచాలీ"ని ఈ నెల 18 వ తేదీన జెమినీ స్టూడియోలో చూసే అవకాశం కలిగింది. ఈ ప్రత్యేక ప్రదర్శనాన్ని పినీ టెక్నీషియన్ల సంఘం వారు ఏర్పాట్లు చేశారు. విభూతిభూషణ్ బంద్యోపాధ్యాయ నవల ఆధారంగా ఈచిత్రం నిర్మించబడ్డది. నవల ఎంత గొప్పదో ఈచిత్రం కూడా అంతగొప్పదనిపిస్తుంది. ఇంత నిర్దాక్షిణ్యమైన, వాస్తవికత దాదాపు ఏచిత్రంలోనూ, కనీసం ఏ భారతీయ చిత్రంలోను చూడలేదు. జీవితం ఎంత క్రూరంగా మానవులమీద ధాడి చేస్తుందో, ఈ చిత్రం కూడా ప్రేక్షకులను అంతక్రూరంగా తన ప్రభావానికిలోను చేసుకుంటుంది. బెంగాలీ గ్రామాల్లోని మానవజీవితంలోని సుఖదుఃఖాలను, జడప్రకృతిలోని సౌకుమార్యం, రాక్షసత్వాలను మేళవించి ఆరెండింటిలోని ఏకత్వాన్ని నిరూపించడంలో దర్శకుడు అద్భుతంగా విజయం పొందాడు. దర్శకుడు సత్యజిత్ రాయ్‌కి, కామెరామాన్, తదితర టెక్నీషియన్లకీ మాత్రమే కాక, నటీనటులకు కూడా సినిమాల్లో పనిచేయడం ఇదే మొదటిసారట. (ఒక్క నటుడు మాత్రమే తెరకు పరిచితుడట.) అయినా వీరందరు ఇంత ప్రతిభావంతమైన చిత్రం నిర్మించడం చాల గొప్ప విషయం. పశ్చిమ బెంగాల్ ప్రభుత్వం ఈచిత్రానికి ధనసహాయం చేయడం కూడా ప్రశంసించదగిన విషయం. ★

## సినిమా వార్తలు

టర్లూకూడా ఈ విషయంలో జంకడానికి ఇదే కారణం.

ప్రభుత్వం ఈ సాధక బాధకాలను గ్రహించి, బాలచలనచిత్రసంస్థ ఒకటి నెలకొల్పింది. సమర్థులైన నిర్మాతలను ఆహ్వానించి, వారిద్వారా యీ సంస్థతరఫున చిత్రాలు నిర్మింపచేయడానికి నిశ్చయించింది. కార్టూన్‌చిత్రాలనిర్మాణానికి ఫిలింస్ డివిజన్‌లో ప్రత్యేక శాఖకూడా ఏర్పాటు చేస్తున్నది. అయితే, కేవలంప్రభుత్వమే పిల్లలచిత్రాలునిర్మిస్తే ఏడాదికి ఎన్నో చిత్రాలు తయారుకావు. ఈ చిత్రాలకొరత తీరదు. చలనచిత్రపరిశ్రమలో వీటినికూడా ఒక ముఖ్యవిభాగంగా గుర్తించి, నిర్మాతలూ దర్శకులూ స్వయంగా పూనుకొంటేనే ఈ చిత్రాలు పుష్కలంగా తయారవడానికి వీలు ఉంటుంది. అందువల్ల ఆర్థికసహాయంతో ఊరుకోక, నిర్మాతలు స్వయంగా తయారుచేసే చిత్రాలను దేశవ్యాప్తంగా ప్రదర్శించడానికి ప్రభుత్వం మార్గాలు ఆలోచించాలి. ఈ విషయంలో కట్టుదిట్టమైన ఏర్పాట్లు చేయగలిగితే నిర్మాతలజంకు పోతుంది.

పిల్లలచిత్రాలుతీస్తే, చూచి ఆదరించేవారు కొల్లలుగా ఉన్నారనడానికి నిదర్శనం బొంబాయిలో జరిగిన బాల చలన చిత్రోత్సవం. 17 హాలులలో అక్కడ 70 చిత్రాలు ప్రదర్శించారు.

వాటినిచూచి ఆనందించిన బాల బాలికలు 80 వేలమంది. ★




# ప్రపంచ ప్రఖ్యాతి గన్న చిత్రకారిణి

వృద్ధాప్యములో అవయవాలన్నీ స్వాధీనములో ఉండటమే గొప్ప అదృష్టము బుద్ధి నిశితముగా ఉండి పనిచేయ గలగటము అంతకంటె విశేషమైనది. అది వైజ్ఞానికముగాగాని కళాత్మకముగాగాని పురోగమించటము అపూర్వాంశము.

సాధారణముగా వయసుమళ్లిన స్త్రీలకు ఆశయాలూ ఆశలూ వ్యక్తిగతమైనవీ, సాంసారికమైనవీ ఉంటాయి. చాలామందికి గృహకృత్యాలతోను మనుమలతోను కాలక్షేపము. కొంతమంది ఆధ్యాత్మిక చింతతో దైవభక్తితో పురాణకాలక్షేపము చేస్తూఉంటారు. ఈ స్త్రీల నామధేయాలు చరిత్రలో కెక్కినవీ ప్రపంచ ప్రఖ్యాతిగాంచినవీ చాలాఅరుదు.

95 సంవత్సరాల ముదుసలి ఏనామేరీ మోజస్ ప్రపంచ ప్రఖ్యాతిగాంచిన చిత్రకారిణి. దాదాపు 1200 వేల చిత్రాలను చిత్రించింది. అవన్నీ, ప్రదర్శనాలలో అలంకరింపబడి, మ్యూజియములలో ప్రదర్శింపబడినవి. వాటివల్ల ఆమెకు ఆర్థికలాభమే కాకుండ విశేషమైన కీర్తి లభించింది.

బాల్యమునుండి చిత్రకళయందు ఆమెకు అభిమానము ఆసక్తి ఉన్నప్పటికీ, బిడ్డలు పెద్దవారైన తరువాతగాని దానిలో కృషి చేయవలెనను బలమైనకోరిక కలుగలేదు. కాని అప్పటికీ అంతిపట్టుదలతో కృషిచేయటము జరుగలేదు. ఆమె 77 సంవత్సరాల వయసున, తనకు చిత్రకళయందున్న అభిరుచికొద్దీ కృషి చేసి కృతకృత్యురాలు అయినది.

ఏనామేరీమోజెస్ ఆబ్రహాము లింకన్ ప్రెసిడెంటుగా ఎన్నుకొనబడిన సంవత్సరములో, 1860 సెప్టెంబరు 7 వ తేదీన అమెరికా దేశములో జన్మించింది. ఆమె పూర్వులు స్కాట్‌లాండ్, ఐర్లెండునుండి అమెరికాకు వలసవచ్చినవారు. న్యూయార్కు రాష్ట్రములోనే స్థిరనివాస మేర్పరచుకొన్నారు.

తల్లికన్న పదిమంది సంతానములో మేరీ ఒకతె. తండ్రి ఆమెను విద్య చెప్పించవలెనని ఎంత ఉత్సాహపడినప్పటికీ, ఆర్థిక చింతతో తల్లి ఆమెను పనిలో ప్రవేశపెట్ట వలసివచ్చినది. ఈ కారణముచేత, ఆమె తన 12-వ ఏట, జీవనోపాధికొరకు పని చేయటానికి నియమింపబడ్డది. మూడు పూటలా వంట చేయటము నేర్చుకున్నది. చేతి కుట్టుతో దుస్తులను తయారు చేయటము గృహకృత్యాలను నిర్వహించటము చక్కగా అలవరచుకున్నది. యజమానురాలి కోరికపై అప్పుడప్పుడు మతగ్రంథమైన బైబులును చదువ వలసివచ్చేది. తన కర్థము కాకపోయినా కూడబలుకుకొని చదువుతూవుండేది.

మేరీ పనిచేస్తున్నచోట మోజెస్ కూడా పనిచేయటానికి నియమింపబడ్డాడు. తీరిక సమయాలలో ఇద్దరూ సమావేశమయి ఇష్టాగోష్ఠి జరుపుకుంటూ ఉండేవారు. ఆమెతో కొంత పరిచయమైనతరువాత, ఆమె రుచిగా వంటచేయగలదనీ, విధేయత విశ్వాసమూగల సేవకురాలనీ అతడు గ్రహించాడు. ఆమె కూడా, అతడు సహృదయుడనీ ఆత్మగౌరవము కలవాడనీ తెలిసికొన్నది. ఇద్దరికీ పరస్పరమూ ఆకర్షణకలగటానికీ, అది ప్రేమగా పరిణమించటానికీ ఎక్కువ కాలము పట్టలేదు. వర నిర్ణయములో తలిదండ్రులు అంతగా పట్టించుకోలేదు. ధనవంతుడు కావలెనన్న పట్టింపు వారికి లేదు. మేరీ

**ఇల్లిందల సరస్వతీదేవి**



# ★ చోళీ డిజైను ★

పై బొమ్మలోని చోళీ డిజైను వివరాలు ఈ క్రింద ఇవ్వబడినవి. ఈ డిజైనులో మూడు కుట్లు వస్తాయి. 1. ముద్దకుట్టు. 2. గొలుసు కుట్టు. 3. కాడకుట్టు.

ఎర్ర రంగు చోళీకి ఈ క్రింది రంగుదారాలు ఉపయోగిస్తే బాగుంటుంది.

చిలకబొమ్మలో నిలువు గీతలు వేసిన భాగంఅంతా చిలకాకుపచ్చ రంగు దారంతో ముద్దకుట్టు వేసి నింపాలి. కళ్లూ, చిలకలమధ్య ఉన్న కలువ డిజైనూ నల్లదారంతో గొలుసుకుట్టు వేసి నింపితే బాగుంటుంది. వాటిపైన ఉన్న ముక్కోణాలకి ముదర పసుపుదారంతో కాడకుట్టు వేసుకోవాలి. ముక్కుకీ, రెక్కల మధ్య తెలుపుకీ బ్రౌన్ దారం నప్పుతుంది. ముద్దకుట్టుతో వీటిని నింపాలి. మెడకీ నడుముకీ ఉన్న ఘటకాలకి తెల్లదారంతో గొలుసుకుట్టు వేసుకోవాలి. చిలకల ముక్కులకి ప్రేలాడే ఆకులు ముదరాకు* పచ్చదారంతో కాడకుట్టు కుట్టాలి. కింద పువ్వులు తెల్లదారంతో ముద్దకుట్టు వేసి నింపుకోవాలి.

రెండో వరసఅంతా లేతనీలంతో ముద్దకుట్టు వేసుకుంటూపోవాలి.

మూడో వరసకూడా ముద్దకుట్టే వేసుకోవాలి. నల్లదారం బాగా నప్పుతుంది.

మూడు వరసలకీ మధ్య ఉన్న గీతలు పసుపుదారంతో కాడకుట్టు కుడితే బాగుంటుంది. ఈ గీతలు అక్కర్లేదనుకుంటే వదిలేసుకోవచ్చు.

ఒకటవ, మూడవ వరసల వెడల్పు ఒకటిన్నర అంగుళం చొప్పున ఉండాలి. మధ్య వరస అంగుళం వెడల్పు. ఈ డిజైనుకి, చోళీ చేతులు మోచేతులవరకూ ఉండడం అవసరం.







పక్క పేజీ బొమ్మలోని చోళీడిజైనకు ఎన్‌లార్జిమెంట్.

# ★ ప్రపంచప్రఖ్యాతిగన్న చిత్రకారిణి ★

కూడా, కేవలము రూపానికీ ధనానికీ ప్రాధాన్యమిచ్చే వ్యక్తి కాదు. ఆమెతో పాటు ఆమె తలిదండ్రులు కూడా సహజ గుణసంపదనూ వంశమర్యాదనూ గ్రహించే వ్యక్తులు కనుక ఆమెకు మోజెస్‌తో వివాహము చేయటానికి నిశ్చయించారు. 1887 నవంబరులో వీరిద్దరికీ వివాహము జరిగింది.

వివాహానంతరము మోజెస్ దంపతులు వర్జీనియా రాష్ట్రములో నూరు యెకరాల పొలము కౌలుకు తీసుకొని సాగుబడిచేస్తూ అక్కడ నివాస మేర్పరచుకున్నారు. పొలముపని చేయటానికి ఇద్దరూ అలవాటు పడ్డారు. పశువులనూ కోళ్ళనూ కూడా పెంచుతూ, వాటి ద్వారా ధనార్జన చేస్తూ ఉండేవారు. 1895 వరకూ ఆ దంపతులకు నలుగురు బిడ్డలు జన్మించారు. అక్షరాభ్యాసము పాఠశాలకు వెళ్లేవరకూ పిల్లలు తల్లి చేతిక్రింద ఇంట్లో అవీ యివీ అందిస్తూ ఉండేవారు. ఇంటిపనీ పొలముపనీ చేసుకుంటూ అన్నివేళలా పనిలో నిమగ్నురాలయిన మేరీకి బిడ్డలను సరిగా పెంచటానికికూడా సమయము ఉండేదికాదు; కాని ఆమె ఏమరేది కాదు. ఎంత తీరిక లేకపోయినా ఆమెలో ఉత్సాహమూ కళానైపుణ్యమూ ఎప్పుడూ పొంగులువారుతూ ఉండేవి. ఆమెకు 1896 లో టొమాటోతో తయారుచేసిన వంటకానికి ప్రథమ బహుమానము లభించింది.

మేరీ మోజెస్‌కు బాల్యమునుండీ స్వతంత్రాభిప్రాయాలు ఉండేవి. అవి ఆమెతో పాటు పెరుగుతూ వచ్చాయి. ఆమెకు స్వతంత్రజీవనముమీద అభిమానము. తాను స్వయముగా కృషిచేసి సంసారభారము వహించవలెనని ఆమె పట్టుదల. పాలనుండి వెన్నతీసి అమ్మకము చేస్తూ ఉండేది. ఉర్లగడ్డను చక్రాలుగా తరిగి వేయించి అమ్ముతూ ఉండేది.

వాళ్లకు క్రిస్మస్ పెద్దపండుగ. ఆ పండుగకు గృహాలంకరణ చేయటము మొదలు పెట్టింది మేరీ మోజెస్. నలుగురూ కలిసి

# ★ ప్రపంచప్రఖ్యాతిగన్న చిత్రకారిణి ★

కూర్పు చేసే గది, కంటికి ఇంపుగా ఉండాలని రంగురంగుల కాగితాలతో గోడలన్నీ అలంకరిస్తున్నది. ఒకగోడకు ఆ కాగితము అరగజములోపుగా తక్కువబడ్డది. పాపమామెకు అప్పటికప్పుడు తెప్పించి అంటించే వ్యవధి లేకపోయినది. ఒక దళసరి కాగితము మీద రెండురకాల ప్రకృతిదృశ్యాలను చిత్రించి గోడకు అంటించింది. ఆచిత్రాన్ని పండుగనాడు యింటికివచ్చిన మిత్రులందరూ ఎంతో మెచ్చుకొన్నారు. మొదటినుండీ ఆమె క్రిస్మస్ కార్డులపైన చిన్నచిన్న చిత్రాలను వేస్తూఉండేది. ఇది ఆమె మొదటి పెద్ద చిత్రము.

మేరికి చిత్రలేఖనములో ఆసక్తి ఉన్నదనిగానీ, ఆమె కృషిచేస్తున్నదనిగానీ ఆమె పెనిమిటికి తెలియదు. తెలియకపోవటానికి కారణము ఆ కళయందు అతడికి అభిరుచీ గౌరవము లేకపోవటమే. ఆకారణముచేతనే ఇంట్లో కనబడ్డచిత్రాలనుగురించిన వివరాలను తెలిసికోలేదు. అతడి జీవితములో అంత్యకాలము సమీపించేముందర — (1927 లో అతడు మరణించాడు) దానికి రెండుమూడుసంవత్సరాలకు పూర్వము, ఒక పర్యాయము బల్లమీది కాగితాలలో ఒక అపూర్వమైనచిత్రము అతడిని ఆకర్షించింది. వెంటనే మేరీని పిలిచి 'ఎవరు గీశారు' అని అడిగాడు. ఆమె ఎంతోసేపు సంశయించింది నిజము చెప్పటానికి. చివరకు అతడి బలవంతముమీద నిజము చెప్పక తప్పిందికాదు. ఆ దినమే ఆమె తనజీవితములో పర్వదినమనుకున్నది. అప్పటినుండీ ఆమె చిత్రాలు అతడి మన్ననలకూ మెచ్చుకోళ్ళకూ పాత్రమైనాయి.

మేరీ మోజెస్ పుట్టిన యింట్లో, ఏ మూల చూసినా—ఏ గోడ చూసినా చిత్రాలే. ఆమె చెల్లెళ్ళందరూ చిత్ర లేఖనములో తగుమాత్రముగా నైపుణ్యాను సంపాదించుకొన్నవారే. మేరీ బాల్యములో వడ్రంగుల వద్ద ఉండే రంగుసుద్దముక్కను సంపాదించి కాగితాలమీద చిత్రాలను గీస్తూ ఉండేది. ఈ ఆసక్తి ఆమెకు జీవితోత్తర భాగములో విరామము లభించినకొద్దీ పునరుజ్వలమై అనేక ఉత్తమ చిత్రాలుగా రూపొందింది. కొన్ని చిత్రాలను ఆమె సిద్ధము చేసిన తరువాత విక్రయశాలకు పంపవలసినదని ఆమె మిత్రులు సన్నిహితులు సలహా యిచ్చారు. ఒక ప్రదర్శనానికి ఆమె కొన్ని చిత్రాలను ఇతర వస్తువులను పంపగా ఆ చిత్రాలకు తప్ప మిగతావాటికి బహుమానము వచ్చింది. తన చిత్రాలకు బహుమానము రాలేదని ఆమె కించ పడలేదు. ఇనుమడించిన ఉత్సాహముతో ఆసక్తితో చిత్రరచన చేస్తూ ఉండేది. ఒక పర్యాయము ఒక ఇంజనీరు ఆమె చిత్రాలను చూడటము తటస్థించింది. మనుమలను ఎత్తిన ముసలమ్మ చిత్రకళానైపుణ్యము అతడికి విస్మయాన్ని కలిగించింది. వెంటనే పది చిత్రాలను ఖరీదు చేశాడు. వాటి నన్నిటిని న్యూయార్కు పట్టణములో జరిగిన ప్రదర్శనములో పెట్టాడు. ఆమె చిత్రాలలో మూడిటిని మ్యూజియములో (Museum of Modern Art Exhibition) ప్రదర్శనకు పెట్టారు. చిత్రకారిణి పేరు వినగానే ప్రజలు గుంపులు గుంపులుగా ప్రదర్శనము చూడటానికి బయలుదేరారు.

1941 లో సిరక్యూస్‌లో జరుగు ప్రదర్శనానికి ఆమె చిత్రాలను పంపవలసినదిగా నిర్వాహకులు కోరినారు. ఆమె తన చిత్రాలలో మూడిటిని ఏరిపంపింది. ఆ ప్రదర్శనానికి కొడుకు బలవంతముమీద ఆమె వెళ్లింది. ఆమె పంపిన మూడు చిత్రాలలో ఒక దానికి న్యూయార్కు రాష్ట్ర బహుమతి లభించింది. అది మొదలు ఆమె చిత్రాల ప్రఖ్యాతి దేశదేశాలలో మారుమ్రోగ నారంభించింది.

ఆమె తైలవర్ణ చిత్రాలను కూడా వేస్తూ ఉండేది. బాల్యములో ఆమె తన చిత్రాలకు ద్రాక్షపండ్ల రసము పూసి ఆనందిస్తూ ఉండేది. తైలవర్ణ చిత్రాలను రచించేటప్పుడు ఎప్పటికప్పుడు 'ఈ చిత్రము ఆఖరుది' అనుకొని ఒకదాని తరువాత ఒకటి పూర్తిచేస్తూ ఉండేది. ఆ తరువాత రంగులు కుంచెలు అనువైనవి లభిస్తున్నకొద్దీ ఆమె చిత్రాలు ఉత్తమ స్థాయికి చేరుతూ ఉండేవి. రంగులలో ఆమెకు ముదురు రంగులు సంతోషాన్ని కలిగించేవి. ఆమె కంటికి అవి మనోహరముగా ఉండేవి. ప్రకృతిలోని రంగులను వాటి నీడలను ఆమె జాగ్రత్తగా పరిశీలించేది. కొంతసేపు కళ్లు మూసుకొని, మనస్సులో ప్రత్యక్షమయిన చిత్రాన్ని చిత్రించేది.

న్యూయార్కు పట్టణములో ఆమె రేడియో కార్యక్రమములో మొదటిసారి పాల్గొన్నప్పుడు ఆమెను ఇంటర్వ్యూ చేసినది జీన్ హార్లే (Gene Horley) "మీ కెటువంటి చిత్రాలు యిష్టము?" అని ఆయన ప్రశ్నించగా "నాకు చారిత్రకమయిన దృశ్యాలనూ మనోహరమైన దృశ్యాలను చిత్రించాలని అభిలాష. ఊహాలకంటె, నా జ్ఞాపకాల ననుసరించే నా చిత్రలేఖనము ఉంటుంది" అని ఆమె సమాధానమిచ్చింది. "మీ చిత్రాలు ప్రసిద్ధి కెక్కినప్పుడు—ముఖ్యముగా క్రిస్మస్ కార్డుల మీద మీ చిత్రాలు అచ్చయినప్పుడు మీ రేమని భావించారు? మనసు సంతోషముతో నిండిపోలేదా?" అని ప్రశ్నించితే ఆమె నవ్వి "నేను నా కీర్తిని గురించి ఎక్కువగా ఆలోచించను. ముందు ఏచిత్రాన్ని వేయాలి అన్న ఆలోచనలతో నామనసు కొట్టుకొని పోతూ ఉంటుంది. కీర్తిప్రతిష్ఠలను గురించి ఆలోచించటానికి తగిన విరామము వుండదు" అన్నది.

న్యూయార్కుపట్టణానికి 200 మైళ్ళ దూరాన ఈగల్ బ్రిడ్జిలోవున్న ఆమె ఇంటికి వెళ్లి దర్శించే ప్రతి జర్నలిస్టూ 'ఇంత వయసులోకూడా ఉత్సాహముతో ఉల్లాసకరముగా ఎట్లా ఉండగలుగుతున్నారని' ప్రశ్నిస్తూ ఉంటారట. 'నాకు ముందు చూపేగాని వెనుకచూపు లేదు. కనుకనే ఉత్సాహముతో ధైర్యముతో పురోగమించగలుగుతున్నాను' అని సమాధానమిస్తూ ఉంటుందట.

ఈమె పేరు ప్రఖ్యాతులు విని అమెరికా అధ్యక్షుడైన ట్రూమను ఆమెకు బహుమాన ప్రదానము చేశాడు. ఆయనసతి ఆమెను తమయింటికి తేనీటివిందుకు ఆహ్వానించింది. ఆవిందు జరుగుతూ ఉండగా పెద్ద గాలివాన వచ్చింది. మేరీమోజెస్ వృద్ధురాలు కనుక మేఘగర్జనలకు భయపడుతుందేమోనని ట్రూమను ఆమెకు ధైర్యముగొలిపే సంభాషణ మొదలుపెట్టాడు. కాని ఆయన మాట్లాడుతూఉంటే ఆమెకు తన కుమారునితో మాట్లాడుతున్నట్లుగా తోచింది. ఆయనను పియానో వాయించవలసిందిగా కోరింది. ఆయన సంతోషముతో వాయించటము మొదలుపెట్టాడు. విందు జరిగిననాడు గాలివానసమయములో వీరిద్దరూ ఈ విధముగా తల్లీకొడుకులవలె కాలక్షేపము చేశారు.

ఆమెకు 90 సంవత్సరాల వయసున 1950 లో 'ముత్తవ్వ మోజెస్' (Grandma Moses) అను అర్ధ చిత్రము తయారుచేయబడినది. 1949 లో రస్సెల్ సేజి కళాశాల 'డాక్టరు' పట్టము నిచ్చింది. 1951 లో మూర్ ఇన్‌స్టిట్యూట్ వారు లలితకళలలో 'డాక్టరు' పట్ట ప్రదానము చేశారు.

నిరాడంబరముగా ఉన్న ఆ గృహములో, చిత్రరచనకై ప్రత్యేకముగా ఒక గది నిర్మింపబడ్డది కాని ఆమె దానిని ఎక్కువగా ఉపయోగించదు. బాల్యదశలో మేనత్త బహూకరించిన ఆ చిన్న బల్లమీదనే చిత్రరచనలు సాగిస్తూ ఉంటుంది. ఆ బల్లముందర మామూలుగా కూర్చుంటేగాని ఆమెకు చిత్రరచనా ధోరణి కలుగదట.

ఆమె 95 సంవత్సరాల ముదుసలి అయినప్పటికీ 70 సంవత్సరాల వయసు గలదిగా కనబడుతుందట. ముఖముమీద ముడతలు ఎక్కువ కనబడవట. దేహము కురచగా ఉన్నప్పటికీ స్ఫుటముగా తీర్చి దిద్దినట్లున్న ఆమె విగ్రహము ఇంకా కోమలముగా ఆకర్షణీయముగా కనబడుతుందట. చమత్కారముగా హాస్యసంభాషణలు చేస్తూ అందరినీ నవ్విస్తూ ఉంటుందట. "చిత్రరచన నాకు అభిమాన విషయము. ఉబుసుపోని కాలక్షేపముగా పైకి కనబడినా, జీవితములో లోపించిన ఆనందాన్నీ సంతోషాన్నీ ఉత్సాహాన్నీ నాకు కలిగిస్తున్నది. కనుకనే నాకు చిత్రరచన మరింత అభిమానమైనది" అని ఆమె తనను చూసి విస్మయ పడిన వారికి సమాధానమిస్తూ ఉంటుందట.

'ఈమె చిత్రరచనలో పురాతనభావాలు ఉట్టిపడుతూ ఉంటాయి. అమెరికా జానపద జీవితాలకు ఈమె చిత్రాలు ప్రతిబింబాలనిపిస్తాయి. రచనావిధానములో కూడా ప్రాచీనత కనబడుతుంది' అని ఆమె చిత్రాలను చూడగానే స్ఫురిస్తుంది కాని ఆ కారణాల వల్లనే ఆ చిత్రాలకు ఘనత వచ్చిందని ప్రముఖుల అభిప్రాయము. కనుకనే నిత్యనూతనముగా కనబడతాయని అందరి నిర్ణయము.

అంతగా విద్యావంతురాలు కాని 95 సంవత్సరాల మేరీ మోజెస్ తన 77 వ ఏటినుంచీ కృషి చేసి నేటి చిత్రకారులలో మేటి అని ఎట్లా అనిపించుకోగలిగింది?

'జీవితములో సాధించవలసిన అంశాలు చాలా ఉన్నాయి. తనకు ఉజ్వల భవిష్యత్తు ముందు ఉన్నది - ఇంకా కాలము మించిపోలేదు - యౌవనదశ జీవితములో ఒక భాగము మాత్రమే'-నన్న భావముతో ఆమె పురోగమించగలిగినదని స్పష్టమవుతున్నది.

★






# మదాం సన్యత్ సేన్

ఈ నెల 16 వ తేదీన చైనానుండి కొత్త అతిథి ఒకరు భారతదేశం వచ్చారు. ఈ అతిథి పేరు సూంగ్ చింగ్ లింగ్. ఈమె చైనా విప్లవమూలపురుషుల్లో ఒకరైన డా॥ సన్యత్ సేన్ భార్య. భారతదేశంపట్ల చైనా స్నేహాన్ని, సుహృద్భావాన్ని వెల్లడించడానికి ఈమె మనదేశం వచ్చింది. రెండు మూడు వారాలపాటు ఈమె మనదేశంలో పర్యటిస్తుంది.

అమెరికాలో విద్య నభ్యసించిన ఈమె డా॥ సన్యత్ సేన్ వద్ద కార్యదర్శినిగా పని చేసింది. 1915 లో ఇరువురూ వివాహం చేసుకున్నారు. 1921 లో డా॥ సన్‌ను సైనిక దళాధిపతులు కొందరు హత్య చేయడానికి ప్రయత్నించిన తరుణంలో ఆమె ధైర్యంగా పనిచేసి సైన్యం కన్నుగప్పి, భర్తను కాంటన్ నగరంనుండి తప్పించింది. 1925 లో భర్త చనిపోయినప్పటినుండీ ఆమె చైనా ప్రజా విప్లవోద్యమంలో ప్రముఖపాత్ర వహించింది.

1949 లో ఈమె నవచైనా రిపబ్లిక్ కు ఉపాధ్యక్షురాలుగా ఎన్నిక అయింది. 1950 లో ఆమె ప్రపంచశాంతి మండలిలో సభ్యురాలై స్టాలిన్ శాంతి బహుమానం పొందింది. 1954 లో చైనా ప్రజా ప్రతినిధుల సభకు ఎన్నికోబడింది. ఈ సభ తాలూకు స్థాయీ సంఘానికి ఉపాధ్యక్షురాలుగాకూడా ఎన్నికోబడింది.

చైనీస్ ప్రజావిప్లవానికి దోహదం చేస్తూ ఈమె ముఖ్యమైన సిద్ధాంతాలను, సూత్రాలను అనేకం ప్రతిపాదించింది. సిద్ధాంత విషయికమైన ఈమె వ్యాసాలన్నీ "స్ట్రగుల్ ఫర్ న్యూచైనా" (నవచైనా కొరకు సంఘర్షణ) అనే పుస్తకంగా ప్రచురింపబడ్డాయి.








(గతసంచిక తరువాయి)

కమల పోయి మంచంమీద పడింది. చాలా సేపలాగే ఉండిపోయింది. రఘు ఇలా చేస్తాడని ఆమె కలలోనైనా ఊహించలేక పోయింది. ఉదారభావాలూ, సంస్కృతీ కల వ్యక్తి అనుకుంది. ఏ మగవాడైనా ఇంతే కాబోలు! ఆడవారితో స్నేహము నేది మగ వారికొక పైతెర కాబోలు. తనపట్ల ఎంతో గౌరవం ప్రదర్శించిన రఘుయే ఇలా చేశాడంటే మిగతా వాళ్ళమాట చెప్పేదేమిటి? ఇటువంటివారిమధ్య తాను నిరాటంక జీవితం గడపగలదా? ఇప్పటికే తనమీద వదంతులు బయలు దేరాయి. తనమీద రఘు చేయబోయిన ప్రయత్నం సంగతికూడా తెలిస్తే ఏమన్నా ఉందా? మెరుపు వెలుతురులో తను నెవ రైనా చూచారేమో. వీధిలో తామిద్దరే ఉన్నారు. ఎవరైనా చూసిఉండవచ్చు. చూస్తే కారుచిచ్చులా వ్యాపించిపోతుంది వార్త. ఇదివరకటి అనుమానాల వల్లేకదా రఘు భార్య వెళ్ళిపోయింది ఇప్పుడీ సంగతి తెలిస్తే ఆమె అనుమానాలన్నీ బుజువైనట్లే కదూ. తనదోషం లేకపోయినా తనదే నంటారు దోషం కాని రఘు దనరు. తనవల్లే అతను చెడిపోయాడంటారు. సుశీల తననే తిట్టుకుంటుంది. తనవల్లే ఆమె సంసారానికి బీటలు వచ్చాయనుకుంటుంది. పోనీ తను నిష్కళంకురాలు అని చెప్పుకుందుకు తన స్నేహాన్ని కలుషితం చేయబూనినది రఘు కాని తనుకాదని చెప్పగలదా? చెప్పినా ఎవరైనా నమ్ముతారా? ఈ పరిస్థితి ఊహించుకుంటే ఆమె కేమి తోచలేదు. ముందు తన భవిష్యత్తుకూడా ఏమవుతుందో! తన మీద ఇంతకుముందున్న అపవాదే తన భవిష్యత్తుకొక ప్రమాదకర విషయంగా పరిణమించవచ్చు. కాని తనమీదనున్న వదంతిని బుజువుపరచడానికి తగిన ఆధార మెవరూ చూపలేరుకదా అనే ధైర్యంతో తలెత్తుకొని తిరిగేది. ఇప్పుడీనాటి సంఘటనవల్ల ముందు తనకు వివాహమే జరగకుండా పోతుందేమో. వివాహం కాకపోయినా ఫరవాలేదని తాననుకోవడంలేదే - బ్రహ్మచారిణిగా జీవితం గడపాలని ఏ మాత్రమూ కోరడంలేదే. తాను తన ఆశయాలూ, అభిలాషలు నిలుపుకోవాలనుకుంది కాని తనకు వివాహం కావాలనీ, భర్త అనురాగం పొందాలనీ, తీయని కలలు కంటోందే. ఇప్పుడది అసాధ్యంగా కనిపిస్తోంది. కలకలగానే ఉండిపోయేటట్లుంది. తన దురదృష్టం కాకపోతే ఆ వానావర్షంలో రఘు నిలబడ్డ చెట్టుక్రిందకే పోవాలా? రఘు ఉన్నాడని తెలిస్తే అటు పోకపోను. మహిళాసంఘంలో మీటింగు అంటే పని కట్టుకొని పోయింది. రఘు చేతుల్లో పడింది! ఈ మనోవేదనతో కుమిలిపోతూ ఆరాత్రి అన్నం వండుకోనే లేదు. అలాగే పడుకుంది. బయట చినుకు బాగా తగ్గిపోయింది. వీధి దీపాలు కూడా తిరిగి వెలిగాయి. ఇంటిఆవిడ కమల వచ్చిందో లేదో చూదామని ఒకమారు వచ్చింది. కమల పడుకోవడం చూచి "ఏమిటమ్మా అలా ఉన్నావు? జ్వరమేమైనా వచ్చిందా యేమిటి?" అని అడిగింది. కమల వెళ్ళి తలుపుతీసి "జ్వరంలేదండీ, ఊరికే తలనొప్పిగావుంటే పడుకున్నానండీ" అంది. "అదేమిటమ్మా కాస్త మందేనా రాసుకోక పోయావూ" అంటూ హడావుడిగాపోయి అమృతాంజనం తెచ్చి కమల వద్దంటున్నా ఆమె మొగానికి రుద్దింది. "ఎల్లాగోల్లా లేచి కొంచెం ఎంగిలిపడమ్మా. వంట చేసుకున్నావా లేదా? లేకపోతే మా యింట్లో అన్నం తెచ్చిపెట్టాను, తిందువుగాని" అని ఆవిడ అడుగుతూంటే కమల "నాకాకలి బొత్తిగా లేదండి. అందువల్ల వంట చేసుకోలేదు. మీరేమీ కంగారు పడకండి. ప్రొద్దున్నకు మామూలుగానే ఉంటాను" అని ఆవిడను పంపివేసి, తలుపు గడియవేసి వచ్చి పడుకుంది. మళ్ళీ కొంతసేపటికి తలుపు చప్పుడైంది. కమలకు విసుగుపుట్టింది. ఈ యింటావిడ కెందుకు తనగొడవ? ఈ పెద్ద కాలపు చాదస్తపుమనుషు లిలాగే ఉంటారనుకొని కాసేపు పలకకుండా ఉంటే ఆవిడే తిరిగిపోతుందని పక్కమీదనుంచి కదలలేదు. కాని తలుపుకొట్టడం యెక్కువైంది. 'కమలా' అని కేక వినిపించింది. ఆ కేకకు కమల అదరిపడి లేచింది. ఎవరూ అన్నయ్యే! తన మొగం చూడనన్న అన్నయ్య ఇక్కడి కెలావచ్చాడు? కమల ఒక్క పరుగున పోయి తలుపుతీసింది. అన్నయ్యే! "అమ్మాయి అప్పుడే పడుకున్నావా, యెంత సేపటికీ తలుపు తీశావుకాదు. కులాసాగా వుంటున్నావా? ఇందాకనే వద్దును. దిక్కుమాలిన వర్షం ఆపివేసింది. వర్షం వెలిసిన తరువాత రిక్షా చేయించుకొని వచ్చాను" అంటూ ఏవిధా విరోధం లేనట్లు ప్రేమ ఉట్టిపడేటట్లు మాట్లాడుతూ గోపాలం లోపలికి వచ్చాడు. "ఇప్పుడే నిద్రపట్టిం దన్నయ్యా, అందుకనే వెంటనే కేక వినిపించుకోలేదు" అంది కమల ఒకవైపు తనమొగం చూడనన్న అన్నయ్య వచ్చాడన్న సంతోషం పొందుతూండగా, ఒకవైపు ఎందుకువచ్చాడా అన్న సందేహం పీడిస్తూండగా "నిసంచీ యిక్కడ పెట్టుకో అన్నయ్యా, ఇప్పుడే వంటచేస్తాను" అని వంటప్రయత్నం చేయబోయింది కమల. "నీవన్నం తిన్నావా, అమ్మా" అని అడిగాడు గోపాలం. "తిన్నానన్నయ్యా" అంది కమల నిజం చెప్పి అతని ప్రశ్న లెదుర్కోవడం ఇష్టం లేక. "నాకొక్కతెకే కాదూ, వండుకు తిన్నాను. పది నిమిషాలలో వంటచేస్తానన్నయ్యా" అంది. "ఎందుకులే పోనీ, ఇంత రాత్రివేళ మళ్ళా వంట ప్రయత్నం చేయడం. కాస్త మజ్జిగవుంటే ఇయ్యి, త్రాగి పడుకుంటాను" అన్నాడు గోపాలం. "అలా వీలులేద"ని చెప్పి కమల త్వరగా వంటయింట్లోకి పోయి, వంటచేసింది. పావు గంటకు అన్నగారికి విస్తరివేసి వడ్డించింది. గోపాలం గబగబా కాళ్ళూచేతులూ కడుక్కొని, సంచిలోనుంచి పట్టుపంచ తీసుకొని కట్టుకొని వచ్చి, విస్తరివద్ద కూర్చున్నాడు. కమల నెయ్యివేసి నిలబడింది. ఇంటావిడ మళ్ళా అటువచ్చి కమల అన్నగారిని చూసి వెనక్కి తప్పుకోబోయింది. కమలే చెప్పింది:

"మా అన్నయ్యోనండి" అని. ఇంటావిడ కొంచెం ముందుకు వచ్చి తలుపు పక్కగా నిలబడి "చాలా సంతోషమమ్మా, చాలా కాలానికి వచ్చారు. ఇంటి వద్ద అంతా ఖులాసాగానే ఉన్నారుకదండి బాబూ" అంది. "అ ఉన్నారండి" అని గోపాలం చెల్లెలికేసి చూశాడు ఎవరీమె అన్నట్టు. "మా ఇంటావిడ అన్నయ్యా, చాలా మంచి వారు" అని పరిచయంచేసింది కమల. ఇంటావిడ "ఈపూట మీ అమ్మాయి తిండి తినలేదు, మీరేనా చెప్పితినిపించండి, బాబూ" అంది. "అలేమిటమ్మాయి, యింకా కాతిన్నానని చెప్పావేం? నిజమే ననుకున్నాను. ఎందుకు తినలేదు? ఒంట్లో ఏమైనా బద్ధకంగా ఉందా?" అని అడిగాడు గోపాలం అన్నం కలపడం మానివేసి. "యీ వేళ కొంచెం తలనొప్పిగావుంది. అందువల్ల తినలేదు. నీమనస్సు బాధపెట్టడ మెందుకని అలా చెప్పాను" అంది కమల. "కాదమ్మా, తలనొప్పివస్తే అన్నం తినడానికేం? తినకపోతే వేడిచేసి మరి కొంత ఎక్కువవుతుంది, రా ఇటు కూర్చో, నీకుకూడా వడ్డించమనో" అని బలవంతంచేశాడు అన్నగారు. "వద్దన్నయ్యా" అంది కమల. "నువ్వు తినకపోతే నేనూ తినన"న్నాడు గోపాలం విస్తరి తీసి వేయబోతూ. కమల ఇక తప్పనిసరై అతని పక్కనే తనకూ వడ్డించుకుంది. ఇద్దరూ భోజనం చేయసాగారు. అన్నగారి ప్రేమ చూసి పొంగిపోసాగింది చెల్లెలు. అన్నయ్య అనాడు ఏదో బాధమీద అని ఉంటాడా మాటలు. నిజంగా ద్వేషంమీద అనిఉండడు అనుకుంది. అన్నా చెల్లెళ్ళు ప్రక్క ప్రక్కన కూర్చొని తింటూంటే ఇంటావిడకు ముచ్చటవేసి "అన్నా చెల్లెళ్ళంటే ఇలా ఉండాలి. మిమ్మల్ని చూస్తే నాకెంతో ముచ్చటగా ఉంది. మీఅమ్మాయి కమల చాలా మంచిపిల్ల బాబూ. కొత్త అందముంటే మిడిసిపడిపోయే ఈరోజుల్లో ఇలాంటి తల్లిని చూడడం బహు అరుదండి. నాజ్వరంలో నాకేక దిక్కై బ్రతికించిందండి. మీ అమ్మాయి చేసినసేవ ఎన్నడూ మరచిపోను. మీ యిద్దర్ని చూస్తూంటే నాకెంతో ఆనందంగా ఉందండీ" అంది ఊరుకోలేక. గోపాలం నవ్వి ఊరుకున్నాడు. కమలకూడా సంతోషంతో ఏమీ మాట్లాడలేకపోయింది. అన్నగారి రాక ఎందుకా అన్న సందేహం లోపల పీకుతూనే ఉంది. కాని అతని ఆప్యాయత చూసి పొంగిపోతోంది. ఏదో ఒంటరిగా బ్రతకగలమని ఒక క్షణంలో ధీమాగా అనుకున్నా, ఆప్తులుంటే పొందే ఆనందం ఎన్నటికీ కాదనలేం. ఇంటిసంగతులన్నీ అడిగింది కమల. అన్నీ వివరంగా చెప్పాడు గోపాలం.

...ళ్లలు పేరుపేరునా ఎలా ఉన్నదీ, ఏమి చేస్తున్నదీ, భార్య ఎలా ఉన్నదీ అన్నీ చెప్పాడు. కాని అసలు తనువచ్చిన ఉద్దేశ్యమేమిటో మాత్రం ఇంకా సూచించలేదు. ఊళ్లో ఏదో పనిమీదవచ్చాడో, లేక తన కోసమే వచ్చాడో! ఇది తలచుకునేసరికి ఆమె గుండె దడదడ కొట్టుకోసాగింది.

గోపాలం విస్తరిదగ్గరనుంచి లేచాడు. కమల లేచి వంటింట్లో అంతా సర్దుకొని వచ్చింది. అన్నగారికి పక్క పరచింది. తను నేలమీద చాప పరచుకుంది. గోపాలం పక్కమీదకు వాలుతూ మళ్ళీ లేచి "అన్నట్లు అమ్మాయి నీకు చెప్పడం మరచాను. నీ స్నేహితురాలుండేదే నాగమణి -"

"ఊఁ - నాగమణి ఏమిటి?" అంది కమల తొందరగా.

"ఆ నాగమణి పాపం చనిపోయిందమ్మా" అన్నాడు గోపాలం మెల్లగా.

కమల అలాగే చాపమీద కూలబడిపోయింది. కొంతసేపు మాట్లాడలేకపోయింది. "ఏమిటీ నాగమణి చనిపోయిందా?" అని తిరిగి ప్రశ్నించింది. "ఎప్పుడు చనిపోయిందన్నయ్యా? ఏం వచ్చింది?" అంది గొంతుక పెకలించుకొని.

"ఏమీ వచ్చి కాదమ్మా. ఒంటిమీద కిరసనాయిలు పోసుకొని అంటించుకొని చచ్చిపోయింది."

కమల ఆ పాదమస్తకమూ కంపించిపోయింది. నాగమణి కిరసనాయిలు మంటలలో కాలిపోతున్నట్లు కళ్ళముందు కనిపించసాగింది. కమల కళ్లనుంచి కన్నీరు ధారకట్టింది. గోపాలమే కొంతసేపాగి మెల్లగా చెప్పాడు: "ఆ పిల్లకు పెళ్ళి కాలేదుకదూ? చదువూ బాగా రాలేదు. అన్ని పార్టుల్లోనూ తప్పిందటకాదూ. ఇటు ఇంట్లో గడవటమే కష్టంగా ఉంది. తల్లీ తండ్రీ బెంగపెట్టుకుపోయారు. ఎదిగిన ఆడపిల్లను ఇంట్లో పెట్టుకు కూర్చున్నందుకు ఇరుగు పొరుగులంతా మాటలనడం మొదలుపెట్టారు. పాపం ఏమీ ఎరగని ఆ అమ్మాయిమీద ఎవళ్ళో వెధవలు ఏవో పుట్టించారు కూడాను. దానాదీనా ఆ అమ్మాయికి అభిమానం వచ్చిందికాబోలు. ఒకరోజు ఇంట్లో ఎవరూ లేని సమయం చూసుకొని బట్టలనిండా కిరసనాయిలు పోసుకొని అంటించుకుంది - అంత గుండె నిబ్బరం ఎలా వచ్చిందో కాని. తల్లిదండ్రులూ, అన్నగార్లూ ఇంటికి వచ్చేసరికి అంతా అయిపోనేఅయిపోయింది. తల్లీ తండ్రీ కంటికీ మంటికీగా ఏడుస్తున్నారు."

కమల నోట మాట పెగలడంలేదు. గోపాలం మంచంమీదకు ఒదిగి "ఈ లోకంలో ఇలాంటివెన్నో రోజూ జరుగుతూనే ఉంటాయమ్మా. ఎన్నో ఆత్మహత్యలూ, ప్రమాదాలూ జరుగుతూనే ఉంటాయి. ఎంతమంది ఎన్ని కష్టాలు పడుతున్నారో. మనకు కష్టాలు వచ్చినప్పుడు మన మనుకుంటాం భగవంతుడు మనకేదో అన్యాయం చేశాడని. కాని ప్రతివాడికీ ఏవో బాధలూ కష్టాలూ ఉంటూనే ఉంటాయమ్మా. కొందరివంతు కేవలం కష్టాలే ఉంటాయమ్మా. వారెంత మంచిగా ఉన్నా వారి నదృష్టం చేరదమ్మా. అయినా నిరాశ చెందకూడదు. ఎన్ని కష్టాలు వచ్చినా సహిస్తూ ముందుకు పోవలసిందే. లోకం మనకేమీ ఈయకపోయినా లోకానికే మనం కొంత ఇచ్చి సంతోషపడాలి," అంటూ ప్రతి భారతీయుడికీ సులభమైన సహజమైనదీ అయిన వేదాంత ధోరణిలో కొంతసేపు ప్రసంగించి మెల్లగా కన్నుమూశాడు గోపాలం.

కాని కమలకు నిద్ర రాలేదు. కిరసనాయిల్ మంటలలో కాలిపోతున్న నాగమణే కళ్లముందాడసాగింది. నాగమణి ఎవరినీ పల్లెత్తుమాట అనేదికాదు. ఎవరెంత గేలి చేసినా పడి ఊరుకునేది. ఆమెను చూసి జాలిపడనివారుండేవారుకాదు. పెళ్ళి సమస్యే ఆమెకూ ఆమె తల్లిదండ్రులకూ కూడా భయంకరరూపం దాల్చింది. నాగమణి నల్లగా ఉండేది. అందువల్ల సంబంధాలు ఎక్కలేదు. ఎందరో వచ్చి చూసేవారు. పెదవి విరిచి చక్కా పోయేవారు. నాగమణి అనాకారి ఎంతమాత్రం కాదు. పరికించి చూస్తే ఆమె మొగంలో ఒక తీరు ఉందనీ, కళ్లలో ఒక వెలుగు ఉందనీ, శరీరంలో ఒక సౌష్ఠవం ఉందనీ, అన్నిటికన్నా హృదయంలోకి దిగిచూస్తే అంతులేని అమృతసరస్సు ఉందనీ, ఎవరికేనా తెలియవస్తుంది. కాని చిన్న కథలూ, ఏకాంకికలూ, ఖండకావ్యాలూ దాటి సాహిత్యమంటే అంతగా శ్రద్ధలేని ఈ రోజుల్లో, ఆ చిన్న కథలైనా చదవడానికి ఓపికా తీరికా లేని ఈ రోజుల్లో పైపై మెరుగులే ఎవరైనా చూడగలుగుతారు కాని నల్లని మొగంలో తీరు కనిపెట్టేందుకూ, హృదయంలోని అమృతం తరచి చూసేందుకూ ఎవరికి ఓపిక ఉంటుంది? నాగమణి పెళ్లి దూరమవుతూనే వచ్చింది. చదువులు చూసైనా ఇష్టపడతారేమోనని అందులో ప్రవేశపెట్టాడు తండ్రి. అదీ ఫలించలేదు. చదువూ సాగలేదు. చివరికి అగ్నిశరణ్యమనుకుంది. నాగమణినిగురించి ఆలోచనలలో అంతకుముందు రఘు చేసిన ప్రయత్నం సంగతి కూడా మరచిపోయింది. తెల్లవారు జామున నిద్ర పట్టింది. మరొక గంటకు లేచిపోయింది. అప్పటికే గోపాలం లేచి కాలకృత్యాలు తీర్చుకొని స్నానం చేసి కూర్చున్నాడు. కమలకు మళ్లీ జ్ఞాపకం వచ్చింది రాత్రి సంఘటన. అన్నయ్యకు తెలిస్తే! కమలకి అన్నగారి కళ్లలోకి చూడడానికి ధైర్యం చాలలేదు. అన్నయ్య దేనికి వచ్చినట్లు? ఇంతవరకూ చెప్పలేదు అని సందేహిస్తూనే త్వరగా స్నానం చేసివచ్చి కొంచెం ఉప్మా కాఫీ తయారు చేసి అన్నగారిని పిలిచింది. అన్నగారు వచ్చి కూర్చున్నాడు. ఉప్మా చూసి అతని ప్రాణం లేచి వచ్చినట్లయింది. ఆబతో తింటున్నాడు. తింటూ చెల్లెలికేసి ఒకసారి చూసి మళ్ళీ తన ప్లేటుకేసి చూస్తూ అన్నాడు: "అమ్మాయ్యీ, నేను వచ్చిందెందుకో నీకు తెలిసే ఉంటుంది కదూ." కమలకు మళ్లీ గుండె

మేష్టారు ఓ అబ్బాయిని నుంచోమని ఒక ప్రశ్న అడిగాడు: "నేనీ రోజున స్కూలుకు వస్తుండగా ఒకడు ఒకగాడిదను బాదుతూండడం చూశాను. నేను అడ్డపడి గాడిదను విడిపించాను. దీన్ని ఏమంటారో చెప్పు."

కుర్రాడు సందేహిస్తూ సమాధానమిచ్చాడు: "తోటి వారిపై జాలి కలిగియుండుట అందురు."

వేగంగా కొట్టుకోసాగింది. తాను భయపడ్డదే నిజమయ్యేటట్లుంది. అయినా వ్యగ్రతతో "తెలియదన్నయ్యా" అంది. "నీ పెళ్ళి విషయమే మాట్లాడడానికి వచ్చానమ్మా" అని కొంతసేపాగి మళ్ళీ అన్నాడు: "నీకు వెంటనే కోపం వస్తుంది. కాని నిన్ను బలవంతం చేయడానికిగాని, బెదరించడానికిగానీ రాలేదమ్మ నేను. ఆనాడు నిన్నలా ఇంట్లోనుంచి పంపివేసినందుకే తరువాత ఎంతగానో బాధపడ్డాను. అంతకుముందెన్నడైనా నిన్ను మాటలన్నానా? అటువంటిది ఆనాడు చిరాకుతో నిన్ను కోపపడ్డానమ్మా. అమ్మ నాన్నా నిన్ను నా చేతిలో విడిచిపెట్టి వెళ్ళారు. తమ్ముడివైనా చెల్లెలివైనా నీ వొకతెవే నాకు. అలాంటి నిన్ను ఇంట్లోనుంచి తరిమివేశానంటే అమ్మ నాన్నా వాళ్ళకి అపచారం చేసినట్లని దుఃఖించానమ్మా. అందుకే మళ్ళీ ఒకమారు వచ్చి చూసి మెల్లగా చెప్పి వెళ్దామని వచ్చాను. నిన్నేమీ బలవంతం చేయను. నీవు కాదన్నా కోపగించుకోను. నీ భావాలు నే నిప్పుడర్థం చేసుకోగలనమ్మా. నీ కనేకమైన కోరికలుంటాయి. అవి తీర్చడానికి నాకూ ఎంతో ఇష్టమేనమ్మా. నా ఒక్కగానొక్క చెల్లెలికి చక్కని వరుడు లభించాలనీ, ఇద్దరూ సుఖంగా ఉండాలనీ నాకూ ఎంతో ఉబలాటంగానే ఉందమ్మా. కాని ఈ రోజున— కట్నాలింతగా పెరిగిపోయిన ఈ రోజున, మర్యాదలేవీ లెక్కలోకి తీసుకోబడని ఈ రోజుల్లో కోరికలు తీరుతాయా అమ్మా? ఆశలు ఫలిస్తాయా? ఆడపిల్ల మెడలో పుస్తె పడితే చాలనే తల్లిదండ్రులెందరో ఉన్నారు. అందులోనూ నా పరిస్థితి నీకు తెలియనిదా? ఏదో గుట్టుగా ఉంచుకుందామనుకున్నాను కాని పీకలమీదకు వచ్చిన తరువాతకూడా ఇక దాచడమెలా సాధ్యమవుతుంది? పోనీ నా చదువేనా సరిగా సాగలేదు, ఈ వ్యాపారం ఎత్తివేసి ఏ ఉద్యోగంలోనైనా ప్రవేశిద్దామంటే, చదువుకున్నవారికే దొరకడంలేదు ఉద్యోగాలు. నాకు దొరుకుతాయా? ఏంచేయను తల్లీ, పిల్లలూ నేనూ ముష్టెత్తుకునే స్థితి వచ్చింది. అందుకే నిజం దాచకుండా చెబుతున్నానమ్మా! ఈ రాజారావు సంబంధమంటే నేనెంతో ఆశపడ్డాను. అంత ఆస్తిగలవాడు, నాకు తప్పక ఆసరా ఈయగలడని ఆశపడ్డాను. మీ వదిన అతనిచేత పెట్టుబడి పెట్టించగలనంది. అందుకే పిల్లలూ నేనూ వీధిన బడనక్కర్లేకుండానే గౌరవంగానే బ్రతకగలుగుతామేమోనన్న ఆశ కలిగిందమ్మాయి. అతను జవసత్త్వాలుడిగిన ఏ ముసలివాడో ముక్కాడో అయితే ఎంత సహాయం చేస్తానన్నా నీలాంటి రత్నాన్ని తీసుకువెళ్ళి ఇవ్వడానికి ఒప్పుకోకపోయి ఉందును. కాని నిజానికి రాజారావు పెద్ద వయస్సువాడు కాడు. పడుచువాడే. అందగాడుకూడా. నీవు చూసి చాలాకాలమయింది కాబట్టి నీకు జ్ఞాపకం ఉండదు, కాని అతను చాలా అందగాడని అందరికీ తెలిసిందే. అతనికి దుర్వ్యసనాలున్నమాట నిజం. సరియైన ఆలనా పాలనా లేక అలా తయారయ్యాడు. కాని నీవింత తెలివైనదానివి, చదువుకున్నదానివి అతన్ని సరియైన దారిలో పెట్టగలవనే విశ్వాసం నాకుందమ్మా. సరియైన భార్య ఉంటే అతని దుర్వ్యసనాలవేపోతాయి. దుర్వ్యసనాలు పోతే అతనంతటి మంచివరుడు మరొకడు దొరకడమ్మా. అందుకే నీవు తప్పక అతన్ని ఊబినుంచి పైకి లాగగలవనే నాకు నమ్మకముంది. కాబట్టి అతని సంబంధంగురించి నీ కింతగా చెప్పుతున్నానమ్మా. ఇందులో నా స్వార్థం నేను చూసుకుంటున్నాను. నిజమే అమ్మాయి. దాచవలసిన పనిలేదు. నీవు నీ స్వార్థమూ చూసుకోవచ్చు. కాని అన్నీ ఆలోచించి నీవు అతన్నీ మమ్మల్నీ కూడా ఉద్ధరిస్తావనే ఆశతోనే ఇంతదూరం వచ్చానమ్మా. ఏమంటావు?" అన్నాడు.

కమల అలానే నిలబడిపోయింది. మనస్సులో అనేక ఆలోచనలు అల్లకల్లోలంగా లేచాయి. మళ్ళీ అడిగాడు గోపాలం. కమల తిరస్కరించలేదు. "నన్ను ఆలోచించుకోనీయి, అన్నయ్యా" అంది. "ఆలోచించుకో, అమ్మా. జాగ్రత్తగా మెల్లగానే ఆలోచించి చెప్పు. దీనిమీద నీకేం బలవంతం లేదని చెప్తున్నాను కదూ. నీవు చేసుకోనన్నా కోపగించి వెళ్ళిపోను. ఉన్న ఒక్క చెల్లెలినీ వదులుకోలేను. మెల్లగానే ఆలోచించుకో అమ్మాయి. నేను చేసిన దానికి కృతజ్ఞతగా ఈ సంబంధానికి ఒప్పుకోమని కూడా అనను అమ్మా. నిన్ను ఇంతవరకు పెంచి చదివించానంటే నా గొప్పేమీ లేదు. అది నా విధి మాత్రమే. చేతనైనంతవరకూ నెరవేర్చాను. నీ బ్రతుకు నీవు బ్రతుకుతున్నప్పుడు నిన్నొత్తిడి చేయడానికి నాకేమీ అధికారం లేదు కూడా. అన్నగా అన్ని పరిస్థితులూ నీ ముందు పెట్టున్నాను. నీవు అతన్ని పూర్తిగా మార్చగలుగుతావనే నాకు పూర్తి నమ్మకముంది. ఆలోచించి చెప్పమ్మా" అని లేచి చేయి కడుగుకొని "సరే అమ్మాయి నేను బెజవాడ వచ్చి చాలా కాలమయింది కాబట్టి ఒకసారి ఊళ్లోకి వెళ్ళి వస్తాను. నీవు నా కోసం కని పెట్టుకు కూర్చోవద్దు. తాళంచెవి ఇంటావిడకిచ్చి వెళ్లు. నేను తరువాత వచ్చి పెట్టుకుతింటాను" అన్నాడు. చొక్కా తొడుగుకొని ఖండువా వేసుకొని సంచీ తీసుకున్నాడు. "మరి బజారులోకి వెళ్లిరానా?" అన్నాడు. వెళ్ళి రమ్మంది కమల. గోపాలం నిలబడి చొక్కా భుజంమీద నున్న చిరుగు ఖండువా మడత క్రింద కప్పి వేయడానికి ప్రయత్నిస్తున్నాడు. కాని ఖండువా మడతలోనే చిరుగుంది. రెండు చిరుగులూ కనబడకుండా చేయాలని తంటాలు పడుతున్నాడు. కమల చూసింది. "ఇంకొక చొక్కా తొడుగుకొని వెళ్ళరాదా, అన్నయ్యా" అంది. "అదీ ఇలాగే ఉందమ్మా, ఇంతకన్న చిరుగులు కూడాను" అన్నాడు. "అయితే ఒక్క నిమిషం ఉండన్నయ్యా" అని లోపలికి వచ్చి, సూదీదారం తీసుకువచ్చి చొక్కా, ఖండువాలు జాగ్రత్తగా కుట్టియిచ్చింది. అవి వేసుకొని "వెళ్ళివస్తానమ్మా" అంటూ మెల్లగా నడచివెళ్తున్నాడు. రిక్షావాడొకడతనిదగ్గరకు వచ్చి 'అయ్యా, రిక్షా కావాలా?' అని అడిగాడు. అక్కర్లేదని చెప్పి నడకనే వెళ్ళిపోయాడు గోపాలం. చొక్కా కుట్టుతున్నప్పుడు కమల అతని చెప్పులకేసి చూసింది. చెప్పులుకూడా అరిగిపోయి ఉన్నాయి. పంచ ఉల్లిపొరలా ఉంది. అన్నగారి మొగం కూడా గమనించింది. లోతుకుపోయిన కళ్లు, సొట్ట దవడలూ, బయటపడ్డ బొమికలూ చూస్తే భయం

 అబల 

చేస్తోంది. అన్నయ్య ఎంత చిక్కిపోయాడు! దూరంగా మెల్లగా అడుగులు వేసుకుంటూ వెళ్తున్న అన్నగారికేసే చూస్తూ కొంతసేపు నిలబడింది కమల. ఒకానొకప్పుడు అన్నయ్య ఎంతపుష్టిగా, ఎంత బాగుండేవాడు. నాన్న బ్రతికివున్నప్పుడు ఎంత సరదాగా ఉండే వాడు. నాటకాలలో వేషాలుకూడా వేసే వాడు. అందులోనూ స్త్రీ పాత్రలు వేసి ఎంతో మెప్పించేవాడు. అటువంటి అన్నయ్య ఇలా అయిపోయాడు! ఇతను ఒకానొకప్పుడు చంద్రమతి, దమయంతి, సావిత్రి వేషాలు వేశాడంటే ఇప్పుడెవరు నమ్ముతారు? ఈ మొగమేమిటి ఆ పాత్రలు వేయడమేమిటి అనుకుంటారు. కాలమూ, పరిస్థితులూ ఎంతమార్పు తీసుకువస్తాయి! అన్నగారి చినిగిపోయిన చొక్కా, ఖండువా, అరిగిపోయిన చెప్పులు, దప్పి దవడలు, లోతుకళ్లు, ఉష్ణమూసి ప్రాణం లేచివచ్చినట్లయిన అతని చూపూ జ్ఞాపకం చేసుకునేసరికి కమలహృదయం అన్నగారంటే విపరీతమైన జాలీ, ప్రేమతో నిండి పోయింది. పాపం, అన్నయ్య నిజంగా ఎంత బాధపడుతున్నాడో. అన్నయ్య కోసం తా నీత్యాగం చేయాలా?

వెంటనే ఆమెకు రఘుచేసిన పని జ్ఞాపకం వచ్చింది. రఘు ఎంతో నమ్మకంగా మెలగి చివరికీ పనికి పూనుకున్నాడు. అతనే ఇలాంటిపని చేస్తే మిగిలినవారిస్వభావాలెలా ఉంటాయో. అలాంటివారిమధ్య తాను తన గౌరవం, స్వాతంత్ర్యం నిలబెట్టకోగలదా? తనకు నచ్చినవ్యక్తితో వివాహమవుతుందా? వివాహం కాకుండా తానుండిపోవలసిం దేనా? వెంటనే మళ్లీ నాగమణి జ్ఞాపకం వచ్చింది. ఆమె జీవితంలో ఆనందం పొంద లేకపోయింది. నిరాశ కాహుతి అయి పోయింది. ఆమె తన జీవితంకూడా చితికి పోయిన స్వప్నంలా అయిపోతుందేమో. ఆశలు ఫలించే అదృష్టం తనకు లేదేమో. తనకు లేకపోతే లేకపోనీ ఇతరులేనా తన వల్ల సుఖం పొందేటట్లుచేసే తన జీవితం కొంతవరకూ సఫలమయ్యినట్లేకాదూ? రాజారావును పెళ్లాడవలసిందేనా. రాజారావు మాట తలచుకునేసరికి ఆమెకు మళ్ళీ గుండె దడ వస్తోంది. కాని అన్నగారు చెప్పినట్లు అతను అందగాడేనేమో. తానతనిని చిన్న తనంలో చూసింది. అప్పటికతని మొదటి భార్య బ్రతికి ఉంది. అప్పటికే అతనిని గురించి అందరూ చెప్పుకుంటూ ఉండడం వల్ల అతనంటే ఒక భయమేర్పడి అతన్ని సరిగా చూడనేలేకపోయింది. అతను అందగాడైతే కావచ్చు స్వభావమో? అతన్ని తాను మార్చగలదా? అన్నయ్య మార్చ గలననుకుంటున్నాడు. తనంత చదువుకున్నదే మార్చలేదా? ఏమో మార్చగలదేమో! ఏమో మార్చలేదేమో! తెలిసి ఉంటే ఒకరు చెప్పి నది విననివాళ్ళు నెవరైనా మార్చగలరా? అటువంటివాడేమో ఈ రాజారావు. మార్చలేకపోతే! మార్చితే—తన జీవితం, అందరి జీవితం సుఖమయం కావచ్చు. ఈ పాచిక వేయవలసిందేమో? మళ్ళీ కిరవ

"మీ రచనలు ఈమధ్య మరీ చప్పగా ఉంటున్నాయండీ. ఇంకా వేడివేడిగా రాయాలి మీరు" అని ఒకాయన కథలు రాసే స్నేహితుడితో అన్నాడు.

"ఏం చేస్తే బావుంటుందో మీరే చెప్పండి" అన్నాడు కథకుడు కొంచెం హేళనగా.

"కుంపట్లో పడెయ్యడం ఒకటే మార్గమనుకుంటాను" అని గంభీరంగా సలహా యిచ్చాడు ఆ మిత్రుడు.

పిచ్చాసుపత్రిని సరదాగా చూట్టానికి వచ్చిన ఒకావిడ అక్కడ ఒక స్త్రీని చూసి ఆస్పత్రి అధికారిని అడిగింది: "ఆ మనిషిని అలా స్వేచ్ఛగా వదిలేశారేం? చూడండి. నన్ను ఎలా గుడ్లురిమి చూస్తోందో?"

"ఏం చెయ్యమంటారు? నిస్సహాయుణ్ణి"

"ఏం, మీరు అదుపులో పెట్టలేరా? ఇక్కడి మనిషేగా?"

"ఆవిడ ఇక్కడి మనిషీ కాదు, అదుపులోనూ పెట్టలేను. ఆమె నా భార్యలెండి."

నాయిలు మంటలలో నాగమణి, చిరిగిన చొక్కాతో, చిక్కిన మొగంతో అన్నగారు, అన్నగారి పిల్లలూ, రఘూ, ఆఫీసులో అతని చేతలూ అన్నీ కళ్ళముందు దృశ్యం తరువాత దృశ్యంగా కదలి పోతున్నాయి. ఒక్కొక్కప్పుడు ఒకటి రెండు దృశ్యాలు కలిసిపోతున్నాయి. దృశ్యాలన్నీ ఒక్కమారు పరుగిడుతున్నాయి కమలకేమీ పాలుపోవడంలేదు. ఉప్పెనలో చిక్కుకున్న పడవలా అయిందామె మనస్సు. అలాగే భోజనంచేసి ఆఫీసుకు వెళ్ళింది.

రఘు స్థానంకేసి చూసింది. రఘు లేడు. తను చేసిన పనికి సిగ్గువల్ల ఆవేళ రాలేకపోయి ఉంటాడనుకుంది. కమలకు ఆఫీసులో వాళ్ళు తనను గురించే చెప్పుకుంటున్నట్లుగా, తనను అనుమానంగా చూస్తున్నట్లుగా అనిపించింది. వాళ్ళకేసి చూడకుండా తన స్థానానికి పోయి కూర్చుంది. పని చేస్తూనే ఉంది కాని ఆమె మనస్సులో నాగమణీ, అన్నగారు, రఘు మెలకువగానే ఉన్నారు. వాళ్ళకు సంబంధించిన దృశ్యాలూ కదలుతూనే ఉన్నాయి. తాను త్యాగం చేయవలసిందేనా? తాను మాత్రం జీవితంలో ఆనందం పొందడానికీ, ఆశయాలు సిద్ధింప చేసుకోడానికీ, ఆశలు ఫలింప చేసుకోడానికీ ప్రయత్నంచేయకూడదా! అన్ని విషయాలకో తలసిందేనా, రీసెస్ వేళ మేనేజరు దగ్గరికి పోయి మాట్లాడివచ్చింది. సాయంత్రం పని ముగించుకొని ఇంటికి బయలుదేరింది. అన్నగారిమాట జ్ఞాపకంవచ్చి, ప్రక్కనున్న మంచి హోటలులో నేతితో తాజాగాచేసిన జిలేబీ, మైసూర్ పాక్, మిక్స్చర్ పొట్లాలు కట్టించుకొని తీసుకువెళ్ళింది. అన్నగారు ఇంటిదగ్గరే ఉన్నాడు. చెల్లెలి మొగంకేసి ఆసక్తితో, ఆదుర్దాతో చూస్తున్నాడు. కమల దగ్గరకు వెళ్ళి పొట్లాలతని చేతిలో పెట్టి తినమంది. "నీవు తీసుకున్నావా?" అని అడిగాడు గోపాలం. "నాకక్కర్లేదులే అన్నయ్యా, నేనింతకుముందే టిఫిన్ తీసుకున్నాన"ని బొంకి కమల లోపలకు పోయింది. గోపాలం పొట్లాలు విప్పి తినడం మొదలు పెట్టాడు. జిహ్వ లేచివచ్చింది. కాని చెల్లెలిజవాబుకోసం నిరీక్షిస్తున్నాడు. అడగడమా మానడమా అనే సందేహంలో పడిపోయాడు. ఇంతలో కమల మామూలు చీర కట్టుకొనివచ్చి "అన్నయ్యా నీవువెళ్ళి ఏర్పాటు చేయవచ్చు" అంది. గోపాలం ఎగిరి లేచి నోటిలో పెట్టుకున్న జిలేబీముక్క అలాగే ఉంచుకొని పెద్దకళ్ళతో అలాగే ఉండిపోయాడు. కొంతసేపటికి మాట తెచ్చుకొని "ఉద్యోగానికి రాజీనామా ఇచ్చేశావా?" అని అడిగాడు. "ఇంకా లేదన్నయ్యా. వాళ్ళకు కొత్తమనిషి దొరకాలిగదూ. ఇంత అకస్మాత్తుగా విడిచి వెళ్ళిపోతే బాగుండదు. అందువల్ల ఇంకొకవారం ఉండివస్తాను. నీవీలోపున ఏర్పాట్లుచేసుకోవచ్చన్నయ్యా" అంది. గోపాలం పొట్లాలు బల్లమీద పెట్టివేసి "ఇవి యిప్పుడు నాకు సయించడంలేదమ్మా, నీవుతిను" అన్నాడు. "నాకక్కరలేదు. తరువాత ఎవరికేనా ఇస్తాను. అలాగే వుంచు" అంది కమల. గోపాలం "సరే అమ్మాయి, ఇప్పుడే బండికి వెళ్ళిపోతాను. ఇంకా బండి బయలుదేరేందుకు అరగంట టైముంది. వెళ్ళి పట్టుకుంటాను" అని త్వర త్వరగా సంచీ సర్దుకున్నాడు. కమల పెట్టె తెరిచి యాభై రూపాయలు తీసి "ఇవి తీసుకో అన్నయ్యా, కొన్ని చిల్లరఖర్చుల కక్కరవస్తాయి. ఇవే నాదగ్గర మిగిలాయి" అని అన్నగారిచేతిలో పెట్టబోయింది. గోపాలం వద్దని త్రోసివేయబోయాడు. "కాదు తీసుకువెళ్ళన్నయ్యా" అని బలవంతంగా అతనిచేతిలో పెట్టింది. గోపాలం చెల్లెలి కళ్ళల్లోకి దీర్ఘంగా చూసి "వెళ్ళివస్తానమ్మా, వారంరోజులలో వచ్చేయి" అని గొడుగు పుచ్చుకొని త్వర త్వరగా నడిచి వెళ్ళిపోయాడు. కమల అతనికేసి చూస్తూ పెద్ద నిట్టూర్పు విడిచి వెంటనే లోపలికి పోయి మంచంమీద పడిపోయింది.

(ఇంకా వుంది)



# అడుసు త్రొక్కనేల కాలు కడుగనేల

ఏ. వి. యల్. నరసింహారావు

బాగా తెల్లవారింది. బళ్ళో గంట గణగణా మ్రోగింది. పిల్లలంతా ఆడుకుంటూ పాడుకుంటూ, చెంగుచెంగున గంతులేస్తూ, సంతోషంగా పోతున్నారు బళ్లోకి.

సూర్యంమాత్రం కాళ్ళనుంచీ తలదాకా దుప్పటి తన్నిపట్టి దొంగగురకపెట్టి నిద్రపోతున్నాడు. బళ్లోకి పోతే పంతులుగారు నిన్న చెప్పిన పాఠంలో ప్రశ్నలు వేస్తారు. జవాబు చెప్పలేకపోతే వీపు చిట్లిపోతుంది.

అమ్మడు గబగబా పాఠం చదువుకుపోతున్నది

"మంచిపిల్లవాడు పెందలకడనే లేచి పలుదోమి స్నానము చేయును. చక్కగా పాఠములు చదివి వేళకు బడికిపోవును"

సూర్యానికి కోపం వచ్చింది.

"అబ్బ, పాడుగోల! చెవికింద మెరొద్దు! అవతలకు పోతావా పోవా? వీపు పగులుతుంది"

"ఔనౌ నన్నాయ్, 'అడుసు త్రొక్కనేల, కాలు కడుగనేల?' పాఠంరాకపోతే ... మరే ... వీపు పగులుతుందనే చెప్పారు పంతులుగారు."

"అమ్మడిపని మా తిమ్మక్కగా ఉందే" అంటూ సూర్యం ఒక్క దూకుతో వచ్చి, అమ్మడివీపు వంచి, దబదబా నాలుగుబాది, పోయి దుప్పటి కప్పుకొని, గురకపెట్టడం ప్రారంభించాడు.

వడమటింట్లో కాఫీ కలుపుతున్న అమ్మ యిదంతా కనిపెడుతూనే వుంది. ఒక్క అడుగులో చకచకా మెల్లాలోకి వచ్చింది. సూర్యం వీపుమీద అయిదు వేళ్లవాతలు తేలాయి. నిద్రమైకం వదిలి సూర్యం ఉలిక్కిపడి లేచాడు. హడావిడిగా ముఖం కడుక్కొని కొంచెం కాఫీ పుచ్చుకొని అమ్మడి వెనకాల బడికి బయల్దేరాడు.

"అమ్మడూ, దోవలో అన్నాయి

"అది కాదమ్మా, (శ్రీ), చుక్క పెట్టేటప్పుడు పంతులుగారు రేపుడూ నాకే '(శ్రీ)' పెడతారని అన్నాయికే కోపమమ్మా, అందుకే నన్నారికే కొడతాడు."

"నా బంగారు తల్లే, ఇంటికొచ్చి నాతో చెప్ప, నేనున్నానుగా" అంటూ అమ్మ ఇంట్లోకి పోయింది. నిన్నేమైనా అంటే పంతులుగారితో చెప్తా..." అమ్మణ్ణి ముద్దుపెట్టుకొని చెప్పిందమ్మ.

సూర్యం అమ్మడివంక గుడ్లురిమి చూచాడు.

పందిరిగుంజకు కట్టేసిన ఆవుదూడ, తల్లిదగ్గర పాలు దాగడానికి మెళ్ళోతాడు అటూ ఇటూ లాక్కుంటూ మెల్లిగా సూర్యం చొక్కా కాస్త నమిలేసింది.

బుజ్జాయంటే సూర్యానికి ఎంతో సరదా. మెళ్ళోతాడు విప్పదీసి

బుజ్జాయి మెడ తన సందిట్లో ఇరికించుకొని బజార్లోకి వచ్చాడు. ముందు అమ్మడూ, వెనక సూర్యం, సూర్యం సందిట్లో బుల్లిబుజ్జాయి అందాల మెడ.

తల్లిదగ్గరకు పోవాలని బుజ్జాయి తెగ పెనగులాడుతూఉంది. సూర్యం దాన్ని బడిదాకా తీసుకొచ్చాడు బలవంతంగా. అమ్మడు వద్దని చెపుతూనే ఉంది. ఉన్నట్టుండి బుజ్జాయి ఒక్క పెద్ద గంతేసి, సూర్యం చేతి పట్టువిడిపించుకొని, దుముక్కుంటూ పోయింది. ఆ విసు రాపుకోలేక సూర్యం బడి పక్కగానఉన్న పైడు కాలువలో పోయి పడ్డాడు. అమ్మడికి భయమేసింది.

బళ్లో కుర్చీలో కూర్చొని కిటికీ చువ్వల్లోనుంచి చూస్తున్న పంతులుగారికి ఇదంతా చక్కగా కనిపిస్తూనే ఉంది. "వాణ్ణిలా పడలాక్కురండిరా!" అంటూ ఇద్దరు కుఱ్ఱాళ్ళ వంక చూచాడు.

రేగిపోయిన జుట్టుతో, డోక్కుపోయిన మోకాళ్ళతో, బురదగొట్టుకున్న గుడ్డల్తో, పొర్లిపొర్లివచ్చే ఏడుపుతో సూర్యం పంతులుగారి ముందు హాజరయ్యాడు.

"దూడల్లే వీడు చదువుతున్నాడు చాలదూ! దాన్నొకదాన్ని వెంటబెట్టుకొచ్చాడు" పంతులుగారు గద్దించారు.

సూర్యం బావురుమని పెద్దగా ఏడ్చాడు.

"వెధవ! అడుసు తొక్కడ మెందుకు, కాలు కడుక్కోవడ మెందుకు?"

పంతులుగారు నిన్నటి పాఠమే అడుగుతున్నా రనుకొన్నాడు సూర్యం.

"పంతులుగారండీ, ఒక్కసారే చదివానండీ, పాఠం నోటికి రాలేదండీ" సూర్యం తల గోక్కుంటూ అన్నాడు.

"నీకు వస్తుందని నేననుకున్నానా? వెళ్ళి బురద కడుక్కురా, బాక్కెనలో నీళ్లున్నయ్"

పిల్లలంతా రొదగా గందరగోళంగా చదవడం ప్రారంభించారు పాఠం. "తనకుగాని పనికి పోరాదు. పోయినచో ప్రమాదము తప్పదు. దూలపుకోతలో కాలుపెట్టి మేకూడదీసినకోతి మరణించెను. అడుసు త్రొక్కనపుడేవిచారింపవలయును. కాలు కడుగుకొనునపుడు విచారించి ప్రయోజనము లేదు"

కాళ్లు చేతులు కడుక్కొని వస్తున్న సూర్యంవంక పిల్లలంతా నవ్వుతూ చూచారు. అందర్నీ నమిలేద్దామన్నంత కోపం వచ్చింది సూర్యానికి. ముక్కు చివరదాకా జారిన కళ్లజోడు అద్దాలమీదుగా పంతులుగారి వాడిచూపులు సూర్యం కళ్ళల్లోకొచ్చి గుచ్చుకున్నాయి. పిల్లిలాగాపోయి సూర్యం అమ్మడి పక్కన ముడుచుక్కూర్చున్నాడు.

"ఓరోయ్ సూరీ, అడుసు అంటే ఏమిటిరా?" పంతులుగారు ప్రశ్నించారు.

సూర్యం "జబా బకదించవా" అన్నట్లు అమ్మడివంక జాలిగా చూచాడు.

"ఏరా సూరీ, లేచి నిలబడు" ఖంగున మోగింది పంతులుగారి పెద్ద గొంతు. అమ్మడి గుండె తరుక్కుపోయింది. "అడుసంటే బురదన్నాయ్, చెప్పు" మెల్లిగా, సూర్యం వైపుకు జరిగి చెప్పింది.

సూర్యానికి అమ్మడిమీద పట్టరాని కోపం వచ్చింది.

"బురదలో పడ్డానని ఎగతాళి చేస్తావటే, ఇంటికి పద, నీ పని చెప్తా"

"ఏమిటిరా సూరీ, నసుగుతున్నావ్?" మళ్ళీ మోగింది పంతులుగారి పెద్దగొంతు. సూర్యం ఒక నిమిషం ఆలోచించాడు.

"ఆఁ...ఆఁ...అడుసంటే...అడుసంటే...అరిశండీ" అంటూ పందెం గెలుచుకున్నట్లు గర్వంగా చూచాడు అమ్మడివంక.

"తిండిపోతు వెధవ, అంతకంటే ఏమి తెలుస్తుంది నీకు," వెనక్కి తిప్పివున్న సూరి నున్నని పల్చని వేళ్ళమీద పంతులుగారి రూళ్ళకఱ్ఱ టకటకా మోగింది. సూర్యం కెవ్వున కేకపెట్టాడు. అమ్మడికళ్లల్లో గిఱ్ఱున తిరిగాయ్ నీళ్లు.

ఒక్క క్షణంలో బడంతా నిశ్శబ్దం.

"నెక్ట్స్, తర్వాత ఎవడురా, పద్యం అప్పజెప్పు"

కృష్ణబాబు హుషారుగా లేచి

BY. 1791



# మీ పిల్లల దుస్తులకు ప్రఖ్యాతి గాంచిన కాట్స్‌వాల్ కొనండి

ఇది మెత్తగా, సౌఖ్యముగా ఉంది. దేహమునకు గాలి ఆడేలా ఉంచుతుంది

ఈసారి మీ పిల్లలకు క్రొత్త బట్టలు కొనునపుడు ఆకర్షణీయమైన కాట్స్‌వాల్ ఎన్నుకొనండి. కాట్స్‌వాల్ తేలికగా ఉండే బట్ట. ఇది ఊలు మరియు నూలుల సరియైన మిశ్రమములో తయారైనది.

కాట్స్‌వాల్ దేహమునకు గాలి ఆడేలా ఉంచుతుంది కనుక మీకు చిరాకు కలిగించేటంత వేడిగా ఎన్నడూ ఉండదు. ఈ ఆకర్షణీయమైన కాట్స్‌వాల్ చాలా కాలము మన్నుతుంది, మరియు క్రుంగకుండా ఉంటుందని హామీ కలదు. ఇది క్రుంగుతే దీనికి బదులుగా బట్ట యివ్వబడుతుంది.

కాట్స్‌వాల్ అనేక దివ్యమైన అద్దకములు మరియు రంగులలో దొరకుతుంది— మీ బట్టల వర్తకుని వద్దకు వెళ్లి నేడే చూడండి!

| | |
|---|---|
| ఏక రంగు రకములు 29/30" | ఒక గజమునకు రు 3/10 |
| ఇజారు దారలు 29/30" | ఒక గజమునకు రు 3/10 |
| ఏక రంగు రకములు 35/36" | ఒక గజమునకు రు. 4/5 |
| అద్దకములు 29/30" | ఒక గజమునకు రు. 4/4 |
| చెక్కు గుడ్డలు 29/30" | ఒక గజమునకు రు. 4/1 |

అమ్మకపు పన్ను అదనము

పెద్దవారి దుస్తులకు—
అంగోలా కొనండి

ఈ నాణ్యమైన ఊలు, నూలు కలిపి దట్టముగా నేసిన బట్ట చల్లని శీతోష్ణస్థితిగల ప్రదేశములు, పర్వత ఆశ్రయములకు తగినది. చొక్కాలకు, ఫ్రీం దుస్తులకు మరియు ఇజారులకు అందమైన రకములలో ఏక రంగులో దొరకుతుంది.



బెంగుళూర్ వులెన్, కాటన్ & సిల్క్ మిల్స్ కంపెనీ లిమిటెడ్
ఏజెంట్సు, సెక్రటరీస్ & ట్రెజరర్సు: బిన్నీ అండ్ కంపెనీ (మద్రాసు) లిమిటెడ్

భారతీయ పరిశ్రమల ప్రదర్శనం, న్యూఢిల్లీ, అక్టోబరు 30-డిసెంబర్ 31 ఛాంబర్ మిల్లు యజమానుల సంఘ మంటపం స్టాలు నెం. బి. 70 ని సందర్శించండి.

# అడుసు త్రొక్కనేల? కాలు కడుగ నేల?

మొదలెట్టాడు, సూర్యంవంక చూస్తూ.

"కుడిచి కూర్చుండ కింటిలో గోల చేసి
గిల్లి కజ్జాలు తెచ్చి యాగీలు పెంచి
వీపు చిట్లిన నేడ్తురా వెఱ్ఱితండ్రి!
అడుసు త్రొక్కంగనేల, కాల్గడుగ నేల?"

పిల్లలంతా సూర్యంవంక చూచి గొల్లుమని నవ్వారు. సూర్యం ఏడుపు ఆపుకోలేక పోయాడు. "బైటికి రండి మీ పని చెప్తా" అనుకున్నాడు.

బళ్ళో గడియారం పదిగొట్టింది. గంట గణగణా మోగింది. "పొండిరా, పిల్లలందరూ" పంతులుగారు సెలవిచ్చారు. ఒక పెద్ద జలపాతంలాగా పిల్లలంతా రొదచేసుకుంటూ బైటకు దూకారు.

పంజరంనుంచి బైటపడ్డ రామచిలుకలా సూర్యం మనస్సు మహానందంతో పొంగిపోయింది. పుస్తకాలు సర్దుకుంటున్న అమ్మడి పొట్టి జడ గట్టిగా లాగి కోడెదూడలా గంతులేస్తూ బైటకొచ్చాడు. పిల్లల వీపులు చరుస్తూ, మెడలువంచి మొట్టికాయలేస్తూ, వాళ్ళు కొట్టవస్తే అందకుండా వీధి అరుగులెక్కి పరుగెత్తుతూ, పోయిపోయి రచ్చబండలదగ్గరాగి అటూ ఇటూ చూచాడు.

ఆ ప్రక్కనే వేపచెట్టు నీడకు మోగన్ను పెట్టి వెనక కాళ్ళమధ్య తోకముడుచుకు పండుకున్న ఆబోతు కనిపించింది సూర్యానికి. పిల్లల్నందర్నీ చేరబిల్చాడు. "మాంచి గమ్మత్తు చేస్తున్నాను చూడండోయ్" అంటూ మెల్లిగా ఆబోతు వెనగ్గా వచ్చాడు. సర్రున దాని తోక చేత్తోలాగి, బలంకొద్దీ గట్టిగా మెలిపెట్టివేశాడు. మోగన్ను పెట్టి కునుకుదీస్తున్న బసవన్న దిగ్గున లేచాడు. తోక పైకెత్తి, ఒళ్లు విరుచుకొని ఖణిల్లున రంకెపెట్టాడు.

పిల్లలంతా కవ్విస్తూ ఎగబడి వెంటబడ్డారు. ఆబోతు గంగడోలు అటూ ఇటూ ఊపుకుంటూ, కోర కొమ్ములు విసురుకుంటూ, పిల్లల మధ్యగా బయలుదేరింది.

వెనకచిక్కిన అమ్మడు ఆబోతును చూచి కెవ్వున కేకపెట్టింది. పరికిణీ కుచ్చెళ్లు అమ్మడి కాళ్ల కడ్డుపడ్డాయి. బసవన్న మళ్ళీ రంకెపెట్టాడు. అమ్మడు బోర్లపడ్డది. ఆబోతు అమ్మడికి దగ్గరగా వచ్చి నక్కింది. అమ్మడి కళ్లు బైర్లుకమ్మాయి.

ఒక పావుగంటవరకూ ఏం జరిగిందో అమ్మడికి తెలియనే తెలియదు. కళ్లువిప్పి చూచేసరికి ఇంట్లో తాను మంచంమీద పండుకొని ఉంది. ప్రక్కన అమ్మా, నాన్నా ఒళ్ళు నిమురుతూ కూర్చున్నారు.

"పిచ్చితల్లీ, ఎంత పాటు పడ్డావే" అంటూ అమ్మ కళ్ళనీళ్ళు పెట్టుకుంటున్నది.

సూర్యం తలుపు చాటున ఉండి అంతా చూస్తూనే ఉన్నాడు.

"అసలా పోట్ల ఆంబోతును కదిలించిందెవరమ్మడూ" నాన్న గట్టిగా అడిగాడు, డొక్కుపోయిన అమ్మడు పెదాలు సవరిస్తూ.

అమ్మడు చెప్పేస్తుందని సూర్యం గుండె దడదడలాడింది. అమ్మడు చెప్పింది. "ఎవరో అబ్బాయి నాన్నా, అన్నాయి గాదు-అయినా నాకిప్పుడేమీ దెబ్బ తగల్లేదుగా"

సూర్యానికి అమ్మణ్ణిచూస్తుంటే ఏడుపు వచ్చింది. ఒక్కసారి పోయి అమ్మణ్ణి ముద్దుపెట్టుకుందా మనిపించింది. అమ్మా, నాన్నా అవతలకు పోయిందాకా ఆగాడు. మెల్లిగా వచ్చి అమ్మడి పక్కన కూర్చొన్నాడు.

"అన్నాయ్, నీ కేమన్నా దెబ్బ తగిలిందా!" అమ్మడు చిన్నగా అడిగింది. సూర్యం కళ్ళవెంట బొటబొటా నీళ్ళు కారాయ్.

"నీవెంత మంచిదానవమ్మడూ, నామూలంగానేగా నీకీ దెబ్బ తగిలింది"

అమ్మడి కెందుకో నవ్వు వచ్చింది. బళ్లో పంతులుగారు చెప్పిన పద్యం గుర్తుకు వచ్చింది. సూర్యం జుట్టులోకి వేళ్లు పోనిస్తూ మెల్లిగా చదివింది:

"కుడిచి కూర్చుండ కింటిలో గోల చేసి
గిల్లి కజ్జాలు తెచ్చి యాగీలు పెంచి
వీపు చిట్లిన నేడ్తురా వెఱ్ఱితండ్రి!
అడుసు త్రొక్కంగనేల కాల్గడుగ నేల?"

"మరేగాని, ఇందులో వెఱ్ఱితండ్రి అంటే ఎవరన్నాయ్" అమ్మడు పకపకా నవ్వింది.

చావిట్లోఉన్న అమ్మా, నాన్నా ఆ మాటలు వింటూ లోపల్లోపల ఊరికే మురిసిపోతూన్నారు. ★

# సూర్య గ్రహణం



గ్రహణం బాగాపట్టినప్పుడు
ఫోటోలు: ఎస్. రామానుజరావు
—అమలాపురం

రోజూ టైముకి లేచి, టైముకి పడుకునే అబ్బాయి ఒకడున్నాడు. ఆ అబ్బాయి ఎంత ఖచ్చితంగా, ఎంత టైముప్రకారం నడుచుకుంటాడంటే, అతన్ని చూసి మనమందరం గడియారాలు దిద్దుకుంటాము. అతను లేకపోతే, గడియారాలూ లేవు, టైమూ లేదు. ఆ అబ్బాయి పేరు సూర్యుడు.

మొన్న 14 వ తేదీన పగలు దాదాపు పదకొండు గంటలకి సూర్యుడు ఉన్నట్టుండి తగ్గిపోసాగాడు. మళ్ళీ మూడు గంటల ప్రాంతాలకి యథాప్రకారం సంపూర్ణంగా తయారయ్యాడు.



గ్రహణం మొదలైనప్పుడు.

సూర్యుడు ఇలా తగ్గిపోవటాన్నే సూర్యగ్రహణం అంటారు.

సూర్యగ్రహణాలు ఏడాదికి ఒకసారి, ఒక్కొక్క ఏడు రెండేసి సార్లు కూడా సంభవిస్తాయి. రాహువు అనే రాక్షసుడు పెద్ద పాము ఆకారంలో వచ్చి సూర్యుణ్ణి మింగేస్తాడని, కొంతసేపు కడుపులో ఉంచుకుని మళ్లీ విడిచిపెడతాడని పూర్వం మనవాళ్ళు అనుకునేవాళ్లు. కాని ఈనాటి శాస్త్రజ్ఞులు కనుక్కున్నదాన్ని బట్టి, సూర్యగ్రహణం ఎందుకు వస్తుందంటే, సూర్యబింబానికీ భూగోళానికీ మధ్య చంద్రగోళం అడ్డం వస్తుంది. చంద్రుడు అడ్డంగా ఉన్నంతమేరా మనకు సూర్యుడు కనిపించడు. అడ్డం తొలగిపోగానే మళ్ళీ సూర్యుడు మామూలుగా కనిపిస్తాడు.

(చంద్రుడికీ సూర్యుడికీ మధ్య భూమి అడ్డంవస్తే చంద్రగ్రహణం)

సూర్యబింబం పూర్తిగా కనిపించకుండా పోయినప్పుడు దాన్ని సంపూర్ణ సూర్యగ్రహణం అంటారు. ఆదృశ్యం చాలా అద్భుతంగా ఉంటుంది. ఆ కాస్తసేపూ సూర్యుడు నీలాకాశంలో నల్లని వలయంగా కనిపిస్తాడు. సూర్యుడు లేకపోవడం చూసి మామూలుగా పగలల్లా దాక్కునిఉండే నక్షత్రాలు కూడా ఆకాశంలో అవతరిస్తాయి.

సూర్యగ్రహణాలంటే ఖగోళశాస్త్రజ్ఞులకు చాల ప్రీతి. ఆ సమయంలో వారు పెద్దపెద్ద దూరదర్శినులు పెట్టుకుని [illegible] ముఖ్యమైన విషయాలు పరిశోధిస్తారు. సూర్యుడికి దగ్గరగా ఉన్న నక్షత్రాల కాంతికిరణాలను వారు గమనిస్తారు. ఈ కిరణాలు కొద్దిగా వంగి ఉంటాయట. బహుశా సూర్యుని ఆకర్షణశక్తివల్ల అలా వంగుతాయట. అందుచేతే నక్షత్రాలు నిజంగా ఒకచోట ఉండి మరోచోట ఉన్నట్టు కనిపిస్తాయి. ★

**బాలగేయం:**

# మ్రాకులు - మబ్బులు

దూతలూరి జగన్నాథం

లేత లేత పాకులు
పూవులాను కొమ్మల
కాపుబట్టి తరువులు
వంగియుండును!

అంబరాన మొక్కునో
అంబరాన తిరుగుచునే
కుంభవృష్టి కురియగనే
క్రింది కరుగు మబ్బులు.

కలిమిగలుగు బాలలు
తెలివి కలిగి యితరుల
మంచి కోరుచుందురు
వంచియుందురు!

# మార్టిన్ రాట్లర్

## 19

స్వాతంత్ర్యంలోని మాధుర్యం కానినతనం అనుభవించినవాడికే అవగతమవుతుంది. మార్టిన్ రాట్లర్ తాను తిరిగి స్వతంత్రుడైనందుకు ఎంత ఆనందించాడో వర్ణించడానికి మాటలు చాలవు. చీకటి పడేదాకా, ఆ చిన్న గుహాలోనే దాక్కుని, తరవాత అతి కష్టంమీద పైకి ఎగబాకి తాను ఇందాక దూకిన శిఖరం మీదికివచ్చాడు. ఇక తనుతన దారినపోవాలనుకున్నాడు. కాని ఆ నిర్జన అరణ్యమార్గాలలో ఒంటరిగా, నిరాయుధుడై, నిరాహారుడై ప్రయాణం చెయ్యడం ఎంత ప్రమాదకరమో అతడు గ్రహించాడు. అందుచేత బాగా చీకటి పడి, సద్దుమణిగినతర్వాత ఇండియన్ గ్రామానికి వెళ్ళి తనకు కావలసినవన్నీ సేకరించుకోవాలని నిశ్చయించాడు. ఇది చాలా సాహసమైన పనే. ఏమాత్రం అజాగ్రతగా ఉన్నా తిరిగి శత్రువుల చేతిలో చిక్కిపోతాడు. అయినా అంతకంటె అతనికి గత్యంతరం కనిపించలేదు. పైగా పలువురు ఇండియన్లు ఏదో వేట కోసం దూరప్రదేశాలకు పయనమై వెళ్ళడం కూడా అతనికి ధైర్యం కలిగించింది.

బాగా చీకటి పడినతరవాత అతడు గ్రామం సమీపించాడు. అందరూ నిద్రలు పోతున్నారు. ఒక కుటీరాన్ని సమీపించాడు. అక్కడ ఎవరూ ఉన్న అలికిడి లేదు. ప్రవేశిద్దామనుకున్నాడు. కాని అడుగు ముందుకు వేసేసరికి, ఎవరిదో గుర్రు వినిపించింది. ఆగాడు. మరొక కుటీరం సమీపించాడు. అందులో ఎవరూ లేరని దృఢపడిన తరువాత ప్రవేశించాడు. మసకచీకటిగా ఉంది లోపల. ఒక గోనెనంచి దొరికింది. దానిలో తనకు కావలసిన వస్తువులన్నీ పడేసుకున్నాడు. ఒక పెద్ద కత్తి, గొడ్డలి, నిప్పురాయి, ఉక్కుముక్క, తీసుకున్నాడు. ఒకమూల ఒక ఉయ్యాల కనిపించింది. అది మడతపెట్టి సంచీలో కుక్కి, మరొకచోట గడ్డి టోపీ కనిపిస్తే అది తీసుకుని, ఇక పోదామని బయల్దేరాడు. హఠాత్తుగా, ఒక ప్రక్కన వేలాడగట్టి ఉన్న ఉయ్యాలలో ఒక మనిషి పడుకుని, కళ్ళు తెరుచుకుని తనకేసే చూస్తూండడం కనిపించింది. అపరిమితమైన భయంతో మార్టిన్ కొయ్యబారి పోయాడు. ఇక పట్టుబడడం తథ్యమనుకున్నాడు. చేతిలోని కత్తితో వాణ్ని పొడిచేద్దామనుకున్నాడు. కాని మానవ రక్తంతో తన చేతులను పాప పంకిలం చేసుకోడానికి అతనికి మనసొప్పలేదు.

ఉయ్యాలలోని ఇండియను భయవిహ్వాల నేత్రాలతో మార్టిన్‌ను చూస్తున్నాడు. చనిపోయిన మార్టిన్ రాట్లర్ మళ్ళీ ఆ గుడిసెలోకి రావడం చూసి, అది మార్టిన్ తాలూకు దయ్యమై ఉండాలని వాడు భావించాడు. వాడి భావం మార్టిన్ కూడా గ్రహించి,

అనువాదం : నండూరి రామమోహనరావు
















**సన్‌లైట్ సబ్బు** బట్టలు చాలకాలము మన్నునట్లు చేయును

భారతదేశంలో తయారుచేయబడినది

S. 236-X52 TL

తనకిక భయంలేదనుకున్నాడు. వెనుక వెనుకకు అడుగులు వేస్తూ, మార్టిన్ మెల్లగా కుటీరాన్ని దాటి రోడ్డు మీదికి వచ్చాడు.

గబగబ నడిచి గ్రామం వెలుపలికి వచ్చాడు. అక్కడి నుంచి దూరంగా కనబడే నీల పర్వతాలకేసి శీఘ్రంగా నడవసాగాడు. నాలుగైదు గంటలలో ఆ పర్వతాలను సమీపించాడు. తెల్లవారే సరికి పర్వతాలెక్కి చాలదూరం వచ్చేశాడు. అలసిపోయినా, సంతోషం ఉబికే హృదయంతో అతడు బ్రెజిల్ తూర్పు కోస్తా ఏదిక్కుగా ఉంటుందో ఊహించుకుని నడవసాగాడు. మధ్యాహ్నానికి చల్లని సెలయేరు ఒకటి కనిపించగా అక్కడ ఆగి తనతో తెచ్చుకున్న పదార్థాలు భుజించాడు. భోజనం చేస్తున్నంతసేపూ తనతో ఇప్పుడు బార్నికూడా ఉంటే ఎంత బాగుండునో అని విచారిస్తూనే ఉన్నాడు. భోజనం చేసిన తరువాత ఉయ్యాలను చెట్టు కొమ్మలకు ఎత్తుగా వేలాడగట్టి అందులో పడుకున్నాడు. మర్నాడు పొద్దుటి దాకా అతనికి మెలకువ రాలేదు. మళ్ళీ భోజనంచేసి బయలుదేరాడు.

ఆ సాయంత్రానికి ఒక సరస్సు ప్రాంతానికి వచ్చాడు. సరస్సులో చాలా మొసళ్లు ఎగిరెగిరి పడుతూ అల్లకల్లోలంగా తిరుగుతున్నాయి. సరస్సుకు సమీపంలో ఒక వృక్షానికి మళ్ళీ ఉయ్యాలను వేలాడగట్టి మార్టిన్ శయనించాడు. ఇంతలో దగ్గిరలో ఏదో అలికిడైంది. పొదలలోనుండి ఒక పులి మెల్లగా పాకుతూ వస్తోంది. సరస్సుఒడ్డున ఇసుకమీద పడుకున్న మొసలిని పట్టుకోవాలని అది వెడుతున్నట్లు మార్టిన్ గ్రహించాడు. పులి కొన్ని గజాల దూరంలో ఆగి, ఒక్క ఎగురు ఎగిరింది. మొసలితోకకు సమీపంలో ఉండే మెత్తటి భాగాన్ని గట్టిగా కరచి పట్టేసింది. మొసలి అటూ ఇటూ తన్నుకుంది. కాని పులి పట్టువిడవలేదు. మొసలి వెనక్కితిరిగి తన్ను కరవడానికి వీల్లేకుండా బిగించి పట్టుకుంది. అలా బాగా గాయం చేసిన తరువాత పులి దాన్ని విడిచి కొన్ని అడుగులు వెనక్కి వేసింది. మొసలి నీటిలోకి పోవడానికి ప్రయత్నించింది. కాని పులి దాన్ని మళ్లీ పట్టుకుని వెనక్కి ఈడ్చుకు వచ్చింది. పిల్లి ఎలుకతో చెలగాటం ఆడినట్లు పులి మొసలితో ఆడుకుంటోందని మార్టిన్ గ్రహించాడు. ఇలా రెండుమూడు సార్లు వదలడం, పట్టుకోడం జరిగాక మొసలి అతి ప్రయత్నంమీద నీటిని సమీపించింది. పులి దాన్ని వెనక్కి ఈడ్చుకు రావడానికి దూకింది. ఆ ఘర్షణలో రెండూ దొర్లుకుంటూ దొర్లుకుంటూ నీటిలోకి పోయి పడ్డాయి. ఒక సారి నీటిలోకి వచ్చిన తరువాత మొసలి ఇక విజృంభించింది. పులి ఒడ్డుకు పారిపోతూంటే లటుక్కున నడుమును కరచి పట్టేసుకుంది. ఇక ఆ పట్టునుండి పులి విడిపించుకోవడం సాధ్యం కాలేదు. అలాగే దాన్ని ఈడ్చుకుంటూ లోపలికి తీసుకుపోయింది మొసలి.

ఈ భయంకర యుద్ధకాండ అంతా చెట్టుమీద నుండి మార్టిన్ తిలకించాడు. సృష్టిలో ఎడతెగకుండా జరిగే సంఘర్షణకు అబ్బురపడ్డాడు.

మర్నాడు మళ్లీ నడక సాగించాడు. త్రోవలో కొత్త కొత్త జంతువులు అనేకం కనబడ్డాయి. చీమలను తినే ఒక జంతువును చూశాడు. దానికి పొడుగాటి నాలుక ఉన్నది. ఆ నాలుకను చీమల పుట్టలో పెట్టి ఉంచుతుంది. చీమలన్నీ ఆ నాలిక మీదకు వస్తాయి. అప్పుడా నాలికను అది ముడుచుకుని చీమల్ని చప్పరించేస్తుంది.

ఇలా ఎన్నో విచిత్రాలు చూస్తూ మార్టిన్ ముందుకు పోయాడు.

## 20

ఒకరోజున అతనికి మనుషులునడిచే కాలిబాట కనిపించింది. అతని సంతోషం చెప్పతరంకాదు. ఎప్పటికైనా మనుషుల్లో పడతానా అని బెంగపెట్టుకున్న మార్టిన్ ఎగిరి గంతేశాడు.

ఆ కాలిబాట వెంటపోదామని నిశ్చయించుకున్నాడు. ఇంతలో అతనికిఎక్కడో గుర్రాల డెక్కల ధ్వనులు వినిపించాయి. మాటలుకూడా వినిపించాయి. శత్రువులో, మిత్రులో తెలిసేదాకా కనబడకపోవడమే మంచిదనుకుని ఒక చెట్టుచాటున దాగాడు.

కొద్ది నిమిషాల్లో కంచరగాడిదలు కొన్ని కనిపించాయి. ఆరుగురు అశ్వికులుకూడా కనబడ్డారు. వారిని చూస్తే బ్రెజిలియన్లు లాగా కనిపించారు. మార్టిన్ వారిని కేకవేసి ఆపాడు. ఆ కేకకు వారు



# మార్టిన్ రాట్లర్



విస్తుపోయి పిస్తోల్లుతీసి అతనికేసి గురిపెట్టారు. కాని ఆ బాలుణ్ణి చూడగానే వారు నవ్వుకుని, పిస్తోల్లు దాచేసి, పోర్చుగీసు భాషలో ప్రశ్నలవర్షం కురిపించారు

"మీాకు ఇంగ్లీషురాదా?" అని మార్టిన్ అడిగాడు.

"నాకు కొద్దిగావచ్చును", అని వారిలో ఒకడన్నాడు. "ఎక్కణ్ణించి వస్తున్నావు నువ్వు?"

"నన్ను ఇండియన్లు బంధించి చాలకాలం వారి గ్రామంలో బానిసగా ఉంచుకున్నారు. నేను ఎలాగో తప్పించుకుని పారిపోయివచ్చాను. చాలారోజులనుంచీ ఈ అరణ్యాలలో సంచరిస్తున్నాను. తూర్పుకోస్తాకు పోవాలని ప్రయాణం చేస్తున్నాను. ఏదన్నాపట్టణం తగిల్తే, అక్కడ కొంతకాలంపాటు పనిచేసి డబ్బు సంపాదించి మా దేశం పోవాలని ఆలోచన" అని చెప్పాడు మార్టిన్.

"అయితే మాతోరా. ఇక్కడికి కొంతదూరంలో వజ్రాలగనులున్నాయి. మేము అక్కడికే పోతున్నాము. నీకు అక్కడేదన్నా పనిదొరకవచ్చు. ఆ గుర్రంమీాద ఎక్కురా", అన్నాడు ఇంగ్లీషు వచ్చిన మిత్రుడు.

మార్టిన్ ఖాళీగాఉన్న ఒక అశ్వం అధిరోహించాడు. ఒక రోజు ప్రయాణంచేసి వారు వజ్రాల గని ప్రాంతం చేరుకున్నారు. మిత్రుడు మార్టిన్‌తో ఇలాచెప్పాడు: ఈ గనులమీాద ముఖ్యాధికారి ఒకాయన ఉన్నాడు. ఆయనపేరు బారన్ ఫగోసి. ఆయనకు ఇంగ్లీషువాళ్లంటే చాలా ఇష్టం. కాని ఆయనకు ఇంగ్లీషు రాదు. నేను ఆయనకు ఇంగ్లీషుదుబాసీగా ఉంటున్నాను. నిన్ను ఆయనకు పరిచయంచేస్తాను బహుశా నీకు ఆయన ఏదైన పనిఇస్తాడనుకుంటాను."

ముఖ్యాధికారి భవనానికి మార్టిన్‌ను తీసుకుపోయాడా మిత్రుడు.

బారన్ ఫగోసీ గుమ్మం వద్ద నుంచుని వైపు కాలుస్తున్నాడు. మనిషి దృఢంగా, బలిష్ఠంగా ఉన్నాడు. రాగి రంగు గడ్డం, మీాసాలు, పెద్ద బుట్టటోపీ మొత్తంమీాద అతన్ని చూస్తే మార్టిన్‌కు సదభిప్రాయం కలగలేదు. బుట్టటోపీలో అతని మొహమైనా సరిగా కనిపించడంలేదు. దూరంనుంచి మార్టిన్‌ను చూడగానే, గిరుక్కున తిరిగి లోపలికిపోయి తలుపులు ధడాలున వేసుకున్నాడు. మార్టిన్‌కు చాలా కోపం వచ్చింది. కాని మిత్రుడతన్ని చెయ్యిపట్టుకుని లోపలికి తీసుకుపోయాడు

బారన్ ఫగోసి గోడవైపు తిరిగి కుర్చీలో కూర్చుని ఏదో రాసుకుంటున్నాడు. తనకోసం వచ్చిన వారికేసి చూడాలనైనా తోచలేదు అతనికి.

దుబాసీ ఏదో చెప్పాడు బారన్‌తో. కాని అదేమీా వినిపించుకోకుండా అతడు గదమాయించి అవతలికి పొమ్మన్నాడు. పోర్చుగీసు బాషలో ఏదో చెప్పాడు కూడాను.

దుబాసీ మార్టిన్‌ను ఒక గదిలోకి తీసుకుపోయి ఇలా చెప్పాడు: "నువ్వు దొంగలాగా కనిపిస్తున్నావని మా అధికారి అనుమానిస్తున్నాడు. నువ్వు వజ్రాలు ఎత్తుకు పోవడానికి వచ్చావని ఆయన అనుమానం. అందుకని నిన్ను ఇక్కడ బంధించమని ఆజ్ఞాపించాడు"

ఇలా అంటూ మిత్రుడు మార్టిన్‌ను అక్కడ వదలి పెట్టి తలుపులు మూసి తాళం వేసి వెళ్ళిపోయాడు మార్టిన్ ఈ వింత సంఘటనకు నిర్ఘాంతపోయి అలా చూస్తూ ఉండిపోయాడు. (ఇంకా ఉంది)

---

## వినోబా భావే

(5-వ పేజీ తరువాయి)

వద్దు. ఉద్ధరిస్తామంటూ, నానాఆర్భాటంతో వారిని ఉక్కిరిబిక్కిరి చేయనూవద్దు. సాటి వారుగా తోటి సోదరులుగా గుర్తించి, గౌరవించండి

### హరిజనభావం పోవాలి

నువ్వెవరవు? అంటే "మనిషిని" అని జవాబివ్వడం నేర్చుకోవాలి హరిజనులంతా. నాయకులు, తమ వాడలకే వస్తారన్న ఊహతో హరిజనులు సభలకు రావటంలేదు ప్రత్యేక సౌకర్యాలుంటాయన్న భావంతో 'హరిజనులు' గానే ఉండాలన్న ధోరణికూడా కనబడుతోంది. ఇది తగదు హరిజనభావం, ఆ మాటకూడా పోవాలి

భూదానంద్వారా వచ్చే భూమిలో మూడోవంతు హరిజనులకు పంచాలనుకుంటున్నాను.

* * *

[భూదానోద్యమాన్ని శ్రీభావే 1951 ఏప్రిల్ 18వ పోచంపల్లి గ్రామంలో ప్రారంభించారు. దేశంమొత్తంమీాద ఐదు కోట్ల ఎకరాలు సేకరించాలని ఆయన సంకల్పం. ఆంధ్రలో శ్రీభావే పాదయాత్ర అక్టోబరు 1వ ప్రారంభమైంది. మన రాష్ట్రంలో లక్ష ఎకరాలు సేకరింపదలచారు.]






## జోళ్లషాపువాడి కెంత నష్టం?
(గతవారం సమస్యకు జవాబు)

ఈ లెక్కకి చాలామంది 200 రూపాయలనీ, 185 రూపాయలనీ జవాబులు చెప్పేరు. కాని యీ జవాబులన్నీ కూడా తప్పే.

చాలామంది జోళ్ళషాపువాడు మొదట నత్యానికిచ్చిన జోడూ, 85 రూపాయలూ జోళ్ళషాపువాడికే నష్టం అని అనుకున్నారు. ఇదెలా సంభవం? షాపువాడు నత్యం యిచ్చిన 100 రూపాయల నోటూ (తనది కాదు) అది చెల్లనిదే అవుగాక, అది పట్టుకెళ్లే చిల్లర మార్చుకొచ్చి అందులోదే యిచ్చాడు గాని తన చేతిది కాదే! కాబట్టి ఆ జోడూ, ఆ 85 రూపాయలూ షాపువాడికి ఎలా నష్టం?

జోడు నష్టం కాదా అంటారేమో, 15 రూపాయలు మినహాయించుకున్నాడుగా మరి! ఇకపోతే అయ్యరు వచ్చి ఆ నోటు చెల్లదని చెప్పినప్పుడు దాని బదులు 100 రూపాయల నోటు మంచిది ఇవ్వ వలసివచ్చింది. ఆ 100 రూపాయిలూ నష్టమే.

కాబట్టి జోళ్ళషాపువాడికి నష్టం 100 రూపాయలు అనవచ్చు.

### అవసరాల రామకృష్ణరావు

ఇంకా సరిగ్గా చెప్పాలంటే - ఈ 100 రూపాయిలలోనూ 15 రూపాయిలు వాడికి ఇదివరకే వచ్చాయి. ఈ 15 రూపాయిలూ జోడు ఖరీదు కాదా అంటారేమో ఈ ఖరీదు ఎవరికి? కొనేవారికి. షాపువాడికి ఆ జోడు ఎంతకి కిట్టిందో!

మొత్తంమీద సరైన జవాబు ఏమిటంటే జోళ్ళషాపువాడికి నష్టం 85 రూపాయిలూ, ఆ జోడూను.

# వరహాలయ్య వజ్రాలు ఎలా పంచాడు

## 3

వజ్రాల గనులలో పనిచేసే వరహాలయ్యకి నలుగురు కొడుకులు. చనిపోయే నాటికి వాడి దగ్గిరున్న ఆస్తి 64 వజ్రాలు. నలుగురికీ నాలుగు పదహార్లు పంచుదామనుకున్నాడు. ఆఖరివాడు యీ కబురు తెలియగానే అమాంతంగా పరిగెత్తుకొచ్చేడు.

'అదేం మాట నాన్నా. చదువు కొన్నవాడివికదా నీకిది న్యాయమే? పెద్దన్నయ్యకీ నాకూ యిరవై ఏళ్లు తేడా. వాడి కెంత ఖర్చయింది? నాకెంత అయింది? ఇద్దరికీ నమానంగా పంచడం నీకు ధర్మమా?' అని గోల పెట్టేడు.

పెద్దవాడూ ఊరుకోలేదు

'మేం పుట్టిననాటినుంచీ మాకు ఎంతెంత అయిందో నువ్వు అణా పైసలతో లెక్క వేశావా ఏమిటి? నా పెళ్ళికి అయిదువంద లేనా అవలేదని చెప్పుకున్నారు. చిన్న తమ్ముడికి అయిదు వేలయిందని నేను అల్లుకెపెట్టేనా? ఎవరికయింది వాళ్ళకయింది. ఒక్కొక్కొ కొడుక్కీ ఒక్కొక్కలా పంచడం నీకు న్యాయమా?'

రెండోవాడూ మూడోవాడూ

కూడా ఖాత్రిగా ఊరుకోలేదు. వర
హాలయ్యకి చచ్చేనాటికి తీరని
దిగులు పట్టుకుంది. వజ్రాలు ఎలా
పంచడం? ఇంతలో తీర్థయాత్రలు
చేసుకుంటూ వరహాలయ్య అక్క
బుద్ధిమతిక ఆ వూరు వచ్చింది.

‘తమ్ముడూ, నీకింత దిగు
లెందుకు? వాళ్ళ నిలా పిలు.’ నలు
గురూ వచ్చారు. ‘నేను ఒకవిధంగా
నాకు తోచినట్లు పంచుతాను,
ఏం?’ అంది ఆమె. ఆవిడ చాలా
తెలివైందని ఆ యింట్లోవాళ్ళందరికీ
నమ్మకం. సరే అన్నారు వాళ్లు.

‘ఇలా చూడండి. ఈ డబ్బు
పంపకంతో మీ సంబంధాలు తెగి
పోవు. ఇచ్చిపుచ్చుకోడాలు లేక
పోతే మీరు అన్నదమ్ములే కారు. ఈ
64 వజ్రాలూ నేను మీకు ఇస్తాను.
ఇవ్వగానే మొదట పెద్దవాడు లేచి
అప్పుడు రెండోవాడి దగ్గిరా,
మూడోవాడిదగ్గిరా నాలుగోవాడి
దగ్గిరా ఎన్నేసి వజ్రాలున్నాయో
చూసి అన్నేసి యిచ్చేసి మిగిలినవి
తనదగ్గిరుంచుకుని కూర్చోవాలి.
తరవాత రెండోవాడు లేచి అప్పుడు
మిగతా వారిదగ్గిర ఎన్నెన్ని
ఉన్నాయో అన్నన్ని వారివారికి
యిచ్చి తన స్థానంలో మిగిలిన
వాటితో కూర్చోవాలి. అప్పుడు
మూడోవాడు లేచి ఒకటోవాడిదగ్గి
రెన్నున్నాయో అన్ని వాడికీ,
అప్పుడు రెండోవాడిదగ్గి రెన్ను
న్నాయో వాడికీ, నాలుగోవాడిదగ్గి
రెన్నున్నాయో వాడికీ ఇచ్చి మిగి
లినవి తనదగ్గరుంచుకోవాలి. అప్పుడు
ఆఖరివాడు లేచి మిగిలిన ప్రతిఒక్కరి
దగ్గిరా అప్పటికి ఎన్నెని
ఉన్నాయో అన్నన్ని యిచ్చి మి
లిన వజ్రాలతో తన స్థానం
కూర్చోవాలి. ఎవరి అదృష్టం ఎ
ఉంటే అలా జరుగుతుంది’ అని అం
రికీ నచ్చచెప్పి వరహాలయ్య చె[illegible]
అసలువిషయం చెప్పింది బుద్ధిమతిక.
ఆ ప్రకారం వరహాలయ్య ఆ 64
వజ్రాలూ నలుగురి కొడుకులికీ
యిచ్చాడు. ఆతరవాత మేనత్త
చెప్పినప్రకారం వాళ్లు చేశారు.
ఎవరి అదృష్టం ఎలా ఉండాలో
గడుసు మేనత్త ముందే నిర్ణయిం
చింది. ఆ ప్రకారం చెయ్యగా ఒక్కొ
క్కరికి 16 వజ్రాల చొప్పున
వచ్చాయి!

పంచుకోక ముందు బుద్ధిమతిక
ఎవరికెన్ని వజ్రాలిమ్మంది?

వరహాలయ్య వజ్రాలు — ఎలా
పంచేడు?

★




Printed and Published for Nageswara Rao Estates Ltd., by S. Radha Krishna at The Andhra Patrika Press, 6 & 7, Tambu Chetty Street, Madras-1. Editor S. Sambhu Prasad.